

చింగీజ్ ఐత్‌మాతొవ్

ప్రఖ్యాత సోవియట్ రచయిత చింగీజ్ ఐత్‌మాతొవ్ (జననం 1928)యొక్క దీప్తివంతమూ అపూర్వ కాల్పనికమైన ప్రజ్ఞ ప్రపంచపు గుర్తింపును సంపాదించుకుంది. ఇతని రచనలు సోవియట్ యూనియన్‌లో అత్యున్నత బహుమతులైన లెనిన్ బహుమతిని, తదితర ప్రభుత్వపు బహుమతులను అందుకొన్నాయి, అనేక భాషల్లోకి అనువదించబడినాయి. ఐత్‌మాతొవ్ రచనలు రెండు – "తల్లి భూదేవి," "తొలి ఉపాధ్యాయుడు" – తెలుగు చదువరులకు సుపరిచితాలు. "జమీల్యా" కథ రచయితకు ప్రపంచ ప్రఖ్యాతిని గడించిపెట్టింది.

సాదా చట్రంలో వున్న ఈ చిన్న పెయింటింగుముందు మళ్లీ నించున్నాను. రేప్పొద్దున్న బయల్దేరి మా గ్రామం వెళ్లాల్సుంది, మరి ఈ పెయింటింగుకేసి అలా తేరిచూస్తూ యెంతోసేపు నించున్నాను – అది చల్లని వీడ్కోలు మాటలు చెబుతుందేమో విందాం అన్నట్టుగా.

ఈ పెయింటింగుని ఇంతవరకూ నేను యే ఎగ్జిబిషనులోనూ ప్రదర్శించలేదు. అంతేకాదు, మా గ్రామంనుంచి బంధువులు నన్ను చూడ్డాని కని వచ్చినప్పుడల్లా ఇది దూరంనుంచైనా సరే వాళ్ల కళ్లబడకుండా వుండేటట్టు చూస్తాను. ఇదొక గొప్ప కళాఖండమేమీ కాకపోయినా, సిగ్గు పడవలసినదేమీ లేదు దీంట్లో. ఇది సాదా చిత్రం; దీనిలో చిత్రించిన నేల యెంత సాదాగా వుందో ఇది అంత సాదాగానూ వుంది.

చిత్రం పూర్వరంగం – వాడిపోయిన శరదాకాశపు టంచు. దూరాన్నున్న కొండవరుసమీదనుండి పరుగులు తీస్తూన్న ధూసరవర్ణపు పిల్లమబ్బులను వెంటతరుముతూంది గాలి. చిత్రం ఉత్తరరంగం – ఎర్రని వరమ్వుడ్ మొక్కలతో నిండిన స్తెప్మైదానమూ, ఇటీవలి వానలకి తడిసి యింకా చెమ్మ ఆరని నల్లని రోడ్డు. రోడ్డు అంచులవెంట చెదురుమదురుగా మొలుస్తున్నాయి ముళ్లగడ్డి తుప్పలు. వానకి కొట్టుకుపోయిన బండిచాళ్ల పక్కన ఇద్దరు బాటసారుల అడుగుజాడలున్నాయి. దారి సాగుతూన్న కొద్దీ

అవి మరింత లీలగా వున్నాయి, ఆ బాటసారులు మరొక్క అడుగు ముందుకు వేశారంటే, ఇక చట్రంవెనక్కి అదృశ్యమైపోతారన్నమాటే. వాళ్లలో ఒకరు... కాని ఆఖరి సంగతులు ముందే చెప్పేస్తున్నానేమిటి?

కథ మొదలైన రోజుల్లో నేనింకా బాగా కుర్రవాణ్ణే, అది యుద్ధం మూడో యేడాది. ఎక్కడో అతిదూరాన కూర్‌స్క్ ఒరేల్ నగరాల దగ్గర మా తండ్రులూ అన్నలూ యుద్ధంచేస్తున్నారు, మరి మేం, అప్పటికింకా పదిహే నేళ్ల ప్రాయంలోనే వున్న కుర్రవాళ్లం, సమష్టిక్షేత్రంలో పనిచేస్తూండే వారం. కష్టమైన దైనందినపు పొలంపని మా లేతబుజాలమీద పడింది. కోతలరోజుల్లో ఇహ మాకు మరీ కష్టమనిపించిపోయేది. కొన్ని వారాల పాటు మేం ఇంటికి రాకుండా అహర్నిశలూ పొలంలోనో, కళ్లంలోనో, లేక రైల్వేస్టేషనుకి గింజలు తోలుకెళ్తూనో కాలం గడిపేవాళ్లం.

కోతవేడికి కొడవళ్లు నిప్పుల్లా కాల్తూన్నట్టే అనిపించుతూ ఎండ బాగా పేల్చేస్తూండిన అలాంటి రోజుల్లో ఓ దినాన, నేను ఖాళీ బండిని రైలుస్టేషనునుండి తోలుకెళ్తూ, ఇహ ఆ రోజుకి ఇంటికెళ్లిపోడానికే నిశ్చయించుకున్నాను.

పాటిరేవు దగ్గర దిబ్బమీద ఎక్కడైతే వీథి ఆఖరైపోతుందో అక్క డున్నాయి పచ్చియిటిక ప్రహరీ వున్న రెండు యిళ్లు. ఇళ్ల చుట్టూ పొడుగాటి పోప్లర్‌చెట్లున్నాయి. ఇవి మా యిళ్లు. ఆ రెండిళ్లల్లోనూ మా రెండు కుటుంబాలూ ఇరుగుపొరుగులుగా ఎన్నో సంవత్సరాలై కాపురం చేస్తున్నాయి. నేను 'పెద్దింటి' కుర్రాణ్ణి, నాకు ఇద్దరు అన్నలున్నారు. వాళ్లకింకా పెళ్లికాలేదు. ఇద్దరూ యుద్ధానికెళ్లారు. అప్పుడే ఎన్ని నెలలయో వాళ్లిద్దరి గురించీ ఏ కబురూ తెలియడంలేదు.

మా నాన్న ముసలాయన, వడ్రంగి. ఆయన పొద్దున్నే నమాజ్

చేసుకుని, ఉమ్మడి ముంగిట వున్న వడ్రంగపు షెడ్డులోకి వెళ్ళిపోతాడు పనిచేసుకుందుకని. సాయంకాలం బాగా పొద్దుపోయాక ఇంటికొస్తాడు.

మా అమ్మా, మా చెల్లాయీ ఇంట్లో వుంటారు.

పొరుగింట్లో — మా గ్రామంలో వాళ్లందరూ ఆ యింటిని "చిన్న యిల్లు" అంటారు — మా దగ్గరబంధువుల కాపురం. మా ముత్తాతలో, మా ముత్తాత తండ్రులో సయాం అన్నదమ్ములు. అయితేనేం, మేం ఒక్క కుటుంబంలాగే వుంటున్నాం, అందుకనే వాళ్లని మా దగ్గరబంధువులని అన్నాను. మా తాతముత్తాతలు సంచారకులుగా జీవించుతూండిన రోజుల్లో కూడా, వాళ్ళ సమష్టిగానే పాత మకాములు ఎత్తేసి, సమష్టిగానే పశువుల్ని కొత్తచోట్లకి తోలుకెళ్లేవారు. ఈ సంప్రదాయాన్ని మేమూ నిలబెట్టాం. సమష్టివ్యవసాయపద్ధతి మా గ్రామానికి వచ్చినప్పుడు మా నాన్నా, వాళ్ల నాన్నా ఇరుగుపొరుగున ఇళ్ళు కట్టుకున్నారు. అక్కడ ఇళ్ళు కట్టుకున్నది ఒక్క మా రెండు కుటుంబాలే కాదు, వూరి యీ చివరనుండి ఆ చివర ఏటిహొద్దువరకూ వున్న అరాల్స్కయ వీధి పొడుగునా వున్న ఇళ్లన్నీ మా తెగ వాళ్లవే, ఆ యిళ్లవాళ్లందరం ఒక్క వంశీయులమే.

సమష్టి వ్యవసాయక్షేత్రం ఏర్పడిన తరువాత, మరికొద్ది కాలానికే 'చిన్న యింటి' యజమాని చనిపోయాడు. ఆ కుటుంబంలో ఇక మిగిలినవారు అతని భార్య, ఇద్దరు కొడుకులూ. కొడుకులు బాగా చిన్నవాళ్ళు. అప్పట్లో మా గ్రామంలో ఇంకా పాటించబడుతూన్న కులాచారం ప్రకారం, కొడుకులున్న వితంతువు తెగను విడిచిపెట్టి వెళ్ళిపోవడానికి వీల్లేదు. అందుకని మా తెగవారు ఆవిడని మా నాన్నకిచ్చి పెళ్ళిచేశారు. పితృదేవతల సమక్షంలో ఆచరించాల్సిన విధి ప్రకారం ఆయనకి తప్పిందికాదిది. చనిపోయిన వ్యక్తికి అందరికంటే దగ్గరబంధువు ఆయనే.

ఈ విధంగా మాకు మరొక కుటుంబం సంక్రమించింది. 'చి
యిల్లు'— ఆ యిల్లూ వాకిలీ, గొడ్డూ గోదా — దానిమట్టుకది ఒ
స్వతంత్ర సంసారంకిందే లెక్క. కాని నిజానికి మేమందరం కలిసేవుండేవార

'చిన్న యిల్లు' కూడా తన వంతు ఇద్దరు కొడుకుల్నీ యుద్ధాని
పంపించింది. పెద్దవాడు సాదిక్ పెళ్లిచేసుకున్న కొద్దిరోజులకే సైన్యంలో
వెళ్లిపోయాడు. వాళ్ల దగ్గరనుండి మాకు వుత్తరాలు వస్తూండేవి, నిజాని
వుత్తరానికీ వుత్తరానికీ మధ్య ఎన్నో రోజులు గడిచిపోయేవి.

'చిన్న యింట్లో' యిద్దరే వుండేవారు: ఆ యింటావిడా — ఆవి
'పిన్ని' అని పిలిచేవాణ్ణి — ఆవిడ కోడలూ. వాళ్లిద్దరూ పొద్దు పొడిచిన
మొదలు పొద్దుగూకేవరకూ సమిష్టి క్షేత్రంలో పనిచేసేవారు. మా పి
చాలా మంచిది, ఉపకారస్థురాలు, బహు నెమ్మదైన మనిషి. పనిలో, కాలువ
తీయడంలో అయితేయేమి, పొలానికి నీరుపెట్టడంలో అయితేయేమి, తనకంటె
చిన్నవాళ్లతో సమానంగా వుండేదే కాని ఎన్నడూ వెనకుండేది కాదు. ఒక
మాటలో చెప్పాలంటే, రెండు చేతులతోనూ పార దృఢంగా పట్టుకునే
ఆవిడె గుణాలకి మెప్పుకోలుగా అన్నట్టు, ఆవిడ అదృష్టం కొద్దీ ఆవిడె
కష్టపడి పనిచేసే కోడలు లభించింది. అలుపు అనకుండా కష్టపడడంల
అయితేనేమి, పనితనంలో అయితేనేమి జమీల్యా ఏవిధంగానూ అత్తగారి
తీసిపోదు, కాని జమీల్యా స్వభావంమాత్రం వేరు.

జమీల్యా అంటే నాకు అతి ఇష్టం. మరి నేనంటే ఆమెకీ ఇష్టమే
మేమిద్దరం చాలాస్నేహంగా వుండేవారం. కాని ఒకరినొకరం పేరుపెట్టి
పిల్చుకుందుకు మాత్రం మాకు ధైర్యం లేకపోయింది. వేరే కుటుంబ
వాళ్లం అయివుంటే నేనామెని తప్పకుండా జమీల్యా అనే పిలిచి వుండేవాణ్ణి
కాని అన్నగారి భార్యని వరసపెట్టే పిలవవలసినట్టు, నే నామెను 'వదిన

అని పిలిచేవాణ్ణి. ఆమె కూడా నన్ను 'చిట్టిమరిది' అని పిలిచేది, నేను అంత చిట్టిపిల్లాణ్ణి కాకపోయినప్పటికిన్నీ. అసలు మా యిద్దరికీ వయస్సులో ఏమంత తేడా లేదు కూడా. అయితేయేం, పెనిమిటి తమ్ముళ్ళని యింటి కోడలు 'చిట్టిమరిది' అనీ, లేక 'చిట్టీ' అనీ పిలవడం మా గ్రామంలో ఆనవాయితీ.

రెండిళ్ళ సంసారమూ మా అమ్మే చక్కబెట్టేది. ఆమెకి మా చెల్లాయి సాయంచేసేది. జుట్టు ఎన్నో జడలుకింద అల్లుకుని, చూసేసరికే నవ్వొచ్చే చిన్నపిల్ల చెల్లాయి. ఆ గడ్డురోజుల్లో అది ఎంత కష్టపడి పనిచేసేదో నేనెన్నటికీ మరచిపోలేను. రెండిళ్ల మేకపిల్లల్నీ, ఆవుదూడల్నీ పెరటితోట లావలకి మేవుకొచ్చేందుకు తీసుకెళ్లేదీ అదే. ఇంట్లో పొయ్యిలోకి ఎప్పుడూ కొరత లేకుండా వుండేందుకని యెండు పేడ, చిదుగులూ పోగుచేసుకొచ్చేదీ అదే. యుద్ధంలో తప్పిపోయిన తన యిద్దరి కొడుకుల గురించీ మనోవ్యాధితో బాధపడుతూన్న అమ్మ వొంటరిపాటుకి వెలుగిచ్చేదీ అదే — మా చప్పిడి ముక్కు చెల్లాయే.

మా పెద్దకుటుంబంలో ఎల్లప్పుడూ సామరస్యం సమృద్ధీ వుండి నందుకు మా అమ్మవే చెప్పుకోవాలి. రెండిళ్ల సంసారాలకీ ఆవిడే సంపూర్ణాధికారంగల యజమాని, ఆవిడే నట్టింట దీపం. సంచారకులుగానే వుండిన మా తాతల కుటుంబంలో ముక్కుపచ్చలారని కోడలిపడుచుగా ఆమె అడుగు పెట్టింది. అటుతర్వాత వారి స్మృతులను పవిత్రంగా ఎంచుకుంటూ కుటుంబాలను న్యాయంగా పాలించుతూండేది. ఆమెకున్న అత్యంత చిత్తశుద్ధీ, ధర్మనిరతీ, విజ్ఞతతోకూడిన అనుభవమూ కారణంగా ఆమెకి మా గ్రామంలో ఎంతో పేరుండేది. ఇంట్లో పెత్తనం అంతా అమ్మదే. నిజం చెప్పాలొస్తే, నాన్నని గ్రామస్థులు కుటుంబ యజమానిగా గుర్తించేవారు

కారు. ఎవరైనా పనిమీద మా యింటికి రానున్నప్పుడు, వాళ్లతో లోకులు ఇలా అనడం నే ననేక సార్లు విన్నాను: "ఇదిగో, నువ్వు 'ఉస్తాక్' (చేతి పనివాని గురించి మేం ఉపయోగించే గౌరవపదం) దగ్గరకి వెళ్లకపోవడమే నయం. తన బాడిదె గురించి తప్ప ఆయనకి మరేమీ తెలీదు. ఆ కుటుంబానికి యజమాని పెద్దమ్మగారే. ఆవిడె దగ్గిరకెళ్లి, ఆవిణ్ణే చూడు."

ఒక విషయం చెప్పాలి: నేను చిన్నవాణ్ణే అయినా, అప్పుడప్పుడు ఇంటి వ్యవహారాల్లో కలుగజేసుకుంటూండేవాణ్ణి. మా అన్నలు యుద్ధానికి వెళ్లి పోవడమే ఇందుకు కారణం కావచ్చు. రెండు కుటుంబాలకీ నేనే 'జిగిత్'*ని — రక్షకుడనూ, పోషకుడనూ — అని ముప్పాతిక మువ్వీసం తమాషా కోసమూ, ఒక్కొక్కప్పుడు నిజంగానూ నన్ను అంటూండడం కద్దు. ఇందుకు నేను మహా గర్వపడేవాణ్ణి. ఈ బాధ్యతాభావం నన్ను వదిలిపెట్టేదికాదు కూడానూ. దీనికితోడు, నా స్వతంత్రబుద్ధిని అమ్మ కూడా ప్రోత్సహించేది. నేను పాదుపూపోడిమీ అలవరచుకోవాలనీ, గడుసరినై వుండాలనీ, అంతేకాని పొద్దు గూకులూ మౌనంగా రంపంతో కోస్తూ, చిత్రిక పట్టుతూండిన నాన్నలా వుండకూడదనీ అమ్మ ఆశించింది.

సరి, ఆనాడు నేను నా బండిని యింటి దగ్గర ఓ విల్లోచెట్టు నీడని నిలబెట్టి, బండి పక్కపగ్గాలను వదులుచేసి, ముంగిట్లోకి వెళ్లేసరికి, అక్కడ మా సమష్టిక్షేత్ర దళనాయకుడు ఒరొజ్మాత్ అవుపడ్డాడు. అతడు ఎప్పట్లాగానే జీనుకి తన చంకకర్ర కట్టి, గుర్రంమీద కూచునున్నాడు. అమ్మ అతని పక్క నించుంది. వాళ్లు దేనిగురించో వాదించుకుంటున్నారు. నేను వాళ్లిద్దరికీ దగ్గరగా వెళ్లేసరికి అమ్మ గొంతుక నాకు వినబడింది:

---

* 'జిగిత్' — నేర్పరైన గుర్రపురౌతు. — సం.

"ఇలా ఎన్నటికీ వీల్లేదు! దేవుడిమీద భయం భక్తీ అంటూ వుంది టయ్యా నీకు? ఆడది బస్తాలు మోసి బండిలో వేస్తుందా? ఎక్కడేనా కద్దా యిది? అదేమీ వీల్లేదు. మా కోడల్ని యిందులోకి దింపకు. పని చేస్తోంది కదా, అలా పనిచేయనీ. సూర్యుడి మొహం ఎలాంటిదో యేనాడో మర్చిపోయాను. రెండు సంసారాలు నడపడానికి ప్రయత్నించు తెలుస్తుంది! నా కూతురు చేతికందుకొచ్చింది కాబట్టి సరిపోయింది.... అప్పుడే వారం రోజులైంది, వీపు యెత్తలేకుండా వున్నాను, నడుం కరాలుమంటోంది, బణాతు చేస్తున్నట్టే. మరి, అదిగో, ఆ మొక్కజొన్న ఎలా వాడిపోతూందో — నీళ్ల కోసం అర్చుకుపోతూంది!" ఆమె ఉద్రేకంతో మాట్లాడుతూంది, తలకి చుట్టుకున్న పాగా కొసను గౌనుకాలరులోకి దోపుకొంటూ. ఆమె కోపంగా వున్నప్పుడెప్పుడూ ఆమెకి అదొక అలవాటు.

"అంత యిదై పోతున్నారేమిటండీ!" అన్నాడు ఒరొజ్మాత్ నిరాశతో, జీనులోనుంచి తటాలున ఒకవైపుకి వాలి. "నాకు యీ కొయ్యమొరడు బదులు కాలు వుండివుంటే మీతో ఈ సంగతి యెత్తేవాణ్ణా చెప్పండి? వెనకట్లాగానే, ఆ బస్తాలన్నీ నేనే బండిలోకి విసరిపారేసి గుర్రాల్ని దౌడు తీయించివుంటేనే నయంగావుణ్ను!... ఇది ఆడంగులు చేసే పనికాదని నాకు మాత్రం తెలియదా యేమిటి? కాని మొగాళ్లని ఎక్కడ్నుంచి లాక్కొచ్చేది నేను?... అందుకనే సైనికుల భార్యల్ని ఈ పని చెయ్యమని కోరడానికి నిశ్చయించుకున్నాం. మీరేమో మీ కోడల్ని పంపించేందుకు వీల్లేదంటున్నారు. సమష్టిక్షేత్రం అధ్యక్షవర్గమేమో నా ప్రాణం తీసేస్తోందాయె.... సైని కులకి బ్రెడ్డు కావాలి, మనమేమో ప్రణాళికను మట్టిపాల్జేసేస్తున్నాం. ఇలాగైతే యేంగాను?"

కొరడాని వేలమీద ఈడ్చుతూ నేను వాళ్ల దగ్గరకెళ్లాను. దళనాయకుడు

నన్ను చూసేసరికి, అతనికేదో ఆలోచన ఛటుక్కున తట్టింది కాబోలు — అతడి ముఖం సంతోషంతో వికసించింది.

"మీ కోడల్ని గురించి మీరంతగా భయపడుతూంటే, ఇదిగో ఆ అమ్మాయి చిట్టిమరది వున్నాడుగా వీడు!" అంటూ నాకేసి సంతోషంతో చూశాడు. "వీడు చూస్తూ వుంటాడు ఆమె ఛాయలకి ఎవ్వడూ రాకుండానూ. ఇహ మీరు యే సందేహమూ పెట్టుకోక్కర్లేదు! సయ్యద్ భేషైన కుర్రాడు. ఇలాంటి కుర్రాళ్లే మనకి తిండి పెడుతూన్నవాళ్లు — మనని ఓ దరికి చేర్చుతూన్న...."

దళనాయకుడి మాటలకి అమ్మ అడ్డుపడింది.

"అయ్యో అయ్యో! నువ్వూ నీ రూపూనూ, ఇదేమిట్రా ఓరి దొమ్మరి నాగమ్మా!" అంది అమ్మ లబోలబోమంటూ. "జుట్టు యెలా పెరిగిపోయిందో, జూలులా.... మీ నాన్న మహా మంచివాడులే. తన పని ఘోషేగాని, కొడుకు తల క్షవరం చేసేందుకేనా ఆయనకి తీరకుండా వుంది!"

"సరే, అబ్బాయి ఈరోజుకి యింట్లో హాయిగా వుండిపోతేసరి," అన్నాడు ఒరొజ్మాత్ చల్లచల్లగా అమ్మతో వంతపలుకుతూనూ. "ఒరేయ్, సయ్యద్, ఈ పొద్దు నువ్వు యింట్లో వుండిపోయి, గుర్రాలకి దాణాపెట్టు. రేపు పొద్దున్నే జమీల్యాకి ఓ బండి ఇద్దాం: మీరిద్దరూ కలిసి పనిచేద్దురు గాని. నా మాటలు విన్నావుకదా — నువ్వు మాత్రం ఆ అమ్మాయి గురించి బాధ్యత తీసుకోవాలిసుమా! 'బయ్‌బిచ్,'* మీరింకేమీ భయపడక్కర్లేదు, ఆమెకేమీ కాకుండా వీడు చూస్తాడు! అయినా, ఎందుకైనా మంచిదని వీళ్లిద్దరికీ తోడుగా దనియార్‌ని పంపిస్తాను. అతణ్ణి మీరెరుగుదురుగా.

---

* 'బయ్‌బిచ్' — పెద్దభార్యా, యింటి యజమానురాలూ. — సం.

ఏ కుచ్చితమూ ఎరగని మనిషి.... ఈమధ్యనే యుద్ధంనుంచి వచ్చేశాడు. వీళ్లు ముగ్గురూ గింజలు తోలుకెళ్తారు స్టేషనుకి. ఇక మీ కోడలిమీద వేలెయ్యడానికి ఎవడికి దమ్ములుంటాయి? ఏం, అంతేకదూ, సయ్యద్? జమీల్యాకి గుర్రబ్బండి తోలేపని అప్పగిద్దామని అనుకుంటున్నాం. నీ ఉద్దేశమేమిటి? మీ అమ్మ ఒప్పుకోవడంలేదు. నువ్వు నచ్చచెబుదూ ఆవిడకి.''

నేను పెద్దవాణ్ణి అయినట్టుగా దళనాయకుడు నన్ను సలహా అడుగుతున్నాడే అని అతని పొగడ్తకి నేను మురిసిపోయాను. దానికితోడు జమీల్యాతో కలిసి స్టేషనుకి బళ్లు తోలుకెళ్లడం ఎంత హాయిగా వుంటుందో నేను వెంటనే మనసులో ఊహించుకున్నాను. ఇహ దాంతో, ముఖం గంభీరంగా పెట్టి అమ్మతో అన్నాను:

''ఆమెకి ఏమీ కాదు. ఏమిటి, ఆమెను తోడేళ్లు మింగేస్తాయనా నీ భయం?''

నేను ఎన్నేళ్లనుంచో బండి తోలేవాడినన్నట్టు, మంచి నేర్పుతో పళ్ల సందునుండి ఉమ్ముతూ బుజాలు పూపుకొంటూ కొరడాని ఈడ్చుకుని మెల్లగా అడుగులు వేసుకుంటూ అక్కడనుంచి వెళ్లిపోయాను.

''విన్నావా వాడి మాటలు?'' అంది అమ్మ విస్తుపోయి. ఆమెకి మనసులో సంతోషంగానే వుండివుండాలి, కాని మళ్లీ అదేసమయంలో కోపంతో బిగ్గరగా అంది: ''తోడేళ్లు మింగుతాయో మింగవో నీకు తెలుస్తున్నా, మహా తెలివైనవాడిలా చెప్పొచ్చావుగాని?''

''వాడిక్కాకపోతే మరెవడికి తెలుస్తుంది? ఈ రెండు కుటుంబాలకీ వాడే 'జిగిత్'! వాణ్ణి చూసి మీరెంతైనా గర్వపడొచ్చు!'' అని ఒరొజ్మాత్ నన్ను వెనకేసుకొస్తూ అన్నాడేగాని, అమ్మ మళ్లీ ఎక్కడ

మొండిగా వాదించుతుందో అని జాగ్రత్తపడుతూ అమ్మకేసి చూశాడు.

అతనితో అమ్మ మరేమీ అభ్యంతరం చెప్పలేదు, కాని ఎందుకోగాని వెంటనే ముఖం వేలేసి, భారంగా నిట్టూర్చి అంది:

"వాడు 'జిగిత్' ఏమిటి? ఇంకా చిన్నపిల్లాడే, అయినా రాత్రింబగళ్లు అలా పనిలో పడి నలిగిపోతున్నాడు.... మా 'జిగిత్తులు' ఎక్కడ తిరుగుతున్నారో ఆ దేవుడికే తెలియాలి! మా యిళ్లు వుత్తవైపోయాయి, అచ్చు పాడుపడిన మకాములే...."

నేనప్పటికే వాళ్లదగ్గరనుంచి దూరంగా వెళ్లిపోయాను. అందుచేత అమ్మ యింకా యేమిటి మాట్లాడిందో మరి నాకు వినబడలేదు. నేను మా యింటి మలుపు దగ్గరకెళ్లి ఫైట్‌మని కొరడా పేల్చేసరికి నేలమీద వున్న దుమ్ము పెద్ద మబ్బులా పైకి రేగింది. అక్కడ ముంగిట్లో అరచేతులతో పిడకలు చేస్తూన్న చెల్లాయి నన్ను చూసి చిరునవ్వు నవ్వింది. కాని ఆ చిరునవ్వుకి జవాబుచెప్పకుండానే నేను డాబుగా నడుచుకుంటూ గుమ్మం దగ్గరకెళ్లిపోయాను. గుమ్మంలో గొంతుగూర్చుని కుండలోవున్న నీళ్లు వొంపుకొని చేతులు కడుక్కున్నాను. తరువాత గదిలోకెళ్లి కప్పులో పెరుగు పోసుకుని తాగి, కప్పునిండా మళ్లీ పెరుగు పోసి, దాన్ని కిటికీ గడపలో వుంచి, బ్రెడ్డుని ముక్కలకింద అందులో చిదిపాను.

అమ్మా, ఒరొజ్మాతూ ఇంకా ముంగిట మాట్లాడుతూనే వున్నారు. కాని వాళ్లిద్దరూ ఇక వాదించుకోవడంలేదు, మెల్లగా నెమ్మదిగా మాట్లాడుకుంటున్నారు. బహుశ మా అన్నలను గురించే మాట్లాడుకుంటూ వుండాలి. కొద్దిగా వాచిన కళ్లని అమ్మ తన గౌను చేతులతో తుడుచుకుని, ఒరొజ్మాత్ మాటలకి జవాబుకింద తల వూపుతూంది పరధ్యానంగా. ఆమెనతడు ఓదార్చడానికి ప్రయత్నించుతూన్నట్టున్నాడు. చెమర్చిన కళ్లతో

అమ్మ వృక్షశిఖరాల మీదనుండి ఎక్కడో సుదూరంలోకి, తన కొడుకులు అక్కడ కనబడతారేమో అనే ఆశతో చూస్తూన్నట్టుంది.

దుఃఖంతో కుంగిపోయున్న అమ్మ, దళనాయకుని సూచనకి ఒప్పు కున్నట్టుంది. అతను మాత్రం తన పని అయినందుకు తృప్తిపొంది, గుర్రాన్ని కమ్చీతో ఓ చరపు చరిచి, దౌడుతీయించి ముంగిటనుంచి వెళ్ళిపోయాడు.

ఇదంతా చిట్టచివరకి యెలా అంతమవుతుందో ఆనాడు అమ్మకిగానీ, నాకుగానీ సహజంగానే యే అనుమానమూ తోచలేదు.

జమీల్యా జోడుగుర్రాల బండిని తోలలేదని నాకు అనుమానం లేదు. ఆమె తండ్రిది కొండవూరు బయార్. అతడు గుర్రపు మందల కాపరి. అటువంటి తండ్రి కూతురు కాబట్టి ఆమెకి గుర్రాల గురించి తెలుసును. మా సాదిక్ కూడా గుర్రపు మందల కాపరే. ఓనాడు వసంతకాలపు గుర్రపు పందేలలో అతడు జమీల్యాని అందుకోలేక ఓడిపోయాడట. మరి ఈ సంగతి నిజమో కాదో ఎవరికి తెలుసును? ఆ పందేలు అయినతరువాత అవమా నితుడైన సాదిక్ ఆమెను ఎత్తుకుని పారిపోయి, పెళ్ళిచేసుకున్నాడంటారు. వాళ్ళిద్దరూ ఒకరినొకరు ప్రేమించుకుని పెళ్ళిచేసుకున్నారని కొందరు ఘట్టిగా అంటారనుకోండి. అది యేలాగైతే కానీయండి, పెళ్లి అయిన నాలుగు నెల్లకే యుద్ధం మొదలైంది, సైన్యంలో చేరాల్సిందని సాదిక్‌కి పిలుపు వచ్చింది.

అది ఎలా వివరించడమో తెలియదుకాని, తండ్రి గుర్రపు మందల్ని కాసేటప్పుడు – తల్లితండ్రులకు ఆమె ఒక్కర్తే సంతానం, ఆమే కూతురూ ఆమే కొడుకూ అవడంచేత – జమీల్యా తన చిన్నతనంలో తండ్రివెంట మందలు కాయడానికి వెళ్ళడంవల్లనో మరెందువల్లనో గాని, ఆమె స్వభావంలో

యేదో మగవాళ్ల లక్షణాలు, అదొక మోస్తరు దుడుకుతనం, ఒక్కొక్క ప్పుడు మొరటుతనం కూడా అవుపడుతూండేది. ఇహ పనిచేసిందంటే దుందు దుకుతనంతోనూ, మొగాళ్లకుండే మొండిపట్టుతోనూ పనిచేసిందన్న మాటే. ఇరుగుపొరుగు ఆడవాళ్లతో ఆమె సరదాగా కలుపుకోలుగా వుండేది, కాని తనని అకారణంగా పల్లెత్తుమాటైనా అంటే మాత్రం, వాళ్ల యెవ్వర య్యేది, ఇహ వాళ్లని మళ్లీ నోరెత్తనివ్వకుండా వాళ్ల మొహంమీదే నాలుగూ అనేసేది, అంతేకాదు అవతల ఆవిడెని జుట్టు పట్టుకుని పీకిన ఘటనలు కూడా జరిగాయి.

ఇరుగుపొరుగు అమ్మలక్కలు ఒకసారికాదు, అనేకసార్లు మా అమ్మతో ఫిర్యాదుచేయడాని కొచ్చేవారు:

"ఇదేమిటోవిడా, మీ కోడలూ? అత్తారింట్లో అడుగుపెట్టి యేడాది కాదుకదా, పట్టుమని నాలుగు వారాలైనా కాలేదు, అప్పుడే ఆ నాలికతో మమ్మల్ని కత్తిరించేస్తూందే! మర్యాదలేదు, మప్పితం లేదు!"

"ఇదే మంచిదిలెండి" అనేది అమ్మ వాళ్లతో. "మా కోడలు ఉన్నమాట చెబుతుంది, అనేదేదో మొహంమీదే అనేస్తుంది. ఇదే నయం, ఎదట నోరునొక్కుకుని, చాటున తిట్టడం కంటె. మీవాళ్ల మౌనం ఓ నటన. ఆ మౌనం – కుళ్లిన కోడిగుడ్డు: పైకంతా నునుపూ నిగనిగా, ఇహ లోపలా – ముక్కు మూసుకోవలిసిందే!"

మామగారూ అత్తగారూ కోడల్ని ఖరాఖండీగా ఖాయిదాపెట్టుతూ తప్పులెంచుతూ కఠినంగా చూడాల్సినట్టుగా మా నాన్న పిన్నీ జమీల్యాని చూసేవారేకారు. ఆమెనెంతో దయగా చూసేవారు, ఆమె అంటే వాళ్లకి ఎంతో అభిమానం. వాళ్లకెప్పుడూ ఒకటే కోరిక: ఆమె ఎల్లప్పుడూ దేవుణ్ణీ పెనిమిటినీ నమ్ముకొని వుండాలని.

వాళ్లని నేను అర్థంచేసుకున్నాను. నలుగురు కొడుకుల్ని సైన్యంలోకి పంపించేశారుకదా, ఇహ ఆ రెండిళ్లకీ ఒక్కర్తే కోడలైన జమీల్యాని చూసుకుని వారు ఊరట పొందేవారు. అందుకనే వాళ్లు ఆమెని అంత జాగ్రత్తగా చూసుకునేవారు. కాని మా అమ్మని అర్థం చేసుకోలేకపోయాను. ఆమె ఎలాంటి మనిషంటే, ఎవరినైనాసరే ఊరకనే ప్రేమించే మనిషి కాదు. మా అమ్మది దాష్టీకపు స్వభావం, ఆమెలో కొంత కరకుతనం కూడా వుండేది. తను పెట్టుకున్న నియమాల ప్రకారం ఆవిడె జీవించేది. వాటిని తు.చ ఆచరించేది. ప్రతి సంవత్సరమూ వసంత ప్రవేశమప్పుడు, మా నాన్న తన యవ్వనంలో తను సొంతంగా తయారుచేసుకున్న 'యూర్త'ను* అమ్మ మా ముంగిట్లో నిలబెట్టి, ఆ గుడిసెలో పొగపెట్టేది. కష్టపడి పనిచేసే వ్యక్తులుగానూ, పెద్దలపట్ల భయభక్తులతో మెలగేవారినిగానూ మమ్మల్ని పెంచింది. మా కుటుంబంలో వున్న ప్రతివారూ కూడా మారు మాటాడకుండా ఆమె చెప్పినట్టు వినాల్సిందే.

జమీల్యా మా యింటికొచ్చిన తొలిరోజునే తెలిసిపోయింది, అందరు కోడళ్లలాంటి కోడలూ కాదని. నిజానికి ఆమె పెద్దవాళ్లని గౌరవించేది, వారి మాటమీద నడిచేది. అయినప్పటికీ కడమ కోడలువడుచుల్లా పెద్దవాళ్ల యెదట అణకువ నటిస్తూ నంగినంగి మాటలూ, వాళ్లవెనక చెవులు కొరకడమూ — ఇదిమాత్రం ఆమెలో వుండేదికాదు. ఆమె యెప్పుడూ తన మనస్సులో మాట నిర్మొగమాటంగా పైకి అనేసేది, తన అభిప్రాయాన్ని దాపరికంలేకుండా చెప్పడానికి భయపడేదికాదు. ఆమెను అమ్మ తరుచుగా

---

* 'యూర్త' — కొయ్యలతో చట్రంచేసి, దానిపై బనాతువేసి కట్టిన గుడిసె. — సం.

బలవరచేది, ఆమె చెప్పినది అంగీకరించేది, కాని చిట్టచివరికి మాత్రం అమ్మ మాట ప్రకారమే జరిగేది.

అమ్మ జమీల్యాలోని నిష్కాపట్యాన్నీ, నిజాయితీనీ చూసి, ఈ గుణాల్లో ఈమె తనకు సాటి అని అనుకునేదనీ, ఆ కుటుంబానికి తనంతటి శక్తి వంతురాలైన యజమానిగానూ, 'బయ్‌బిచె'గానూ, ఆ యింటి దీపానికి రక్షకు రాలుగానూ ఆమెను తన స్థానంలో నిలబెట్టుదామనీ అమ్మ కలలుకంటూఁం డేదని నాకు అనిపించేది.

''అల్లా కటాక్షం వుండబట్టి సమష్టిదీ పునీతమూ అయిన యింట్లో మెట్టుతున్నావు నువ్వు, అమ్మాయీ'' అని అమ్మ ఆమెకి బోధించింది. ''ఇది నీ అదృష్టం. పుట్టెడు పిల్లల్ని కనడం, పుష్కలంగా వున్న యింట్లో సంసారంచేయడం ఆడదాని అదృష్టం. దేవుడి దయవల్ల ముసలాళ్లం మేం ఏదో ఇంత సంపాదించాం, చచ్చి మాతో పట్టుకుపోయేది లేదుకదా, అదంతా మీదే. అయితే, సిరి అంటావూ, చిత్తశుద్ధినీ మనస్సాక్షినీ యెవ రైతే పవిత్రంగా యెంచుకుంటారో వాళ్లింట్లోనే వుంటుంది. దీన్ని జ్ఞాపకం వుంచుకో, బుద్ధిగా వుండు!...''

జమీల్యాలో మరి యేముండెనో గాని, అత్తగార్లిద్దరూ మాత్రం యెంతైనా ఆందోళనపడ్డారు: ఆమెది పూర్తిగా మాయామర్మమూ లేని ఉల్లాసం – చిన్నపిల్లలా. ఒక్కొక్కప్పుడు ఏ కారణమూ లేకుండానే తటాలున నవ్వడం మొదలెట్టేది, అదైనా గట్టిగానూ, అతి సంతోషం తోనూ. మరి పనినుండి వచ్చేసేప్పుడు నెమ్మదిగా ఇంటికి రావడం బదులు, చెంగున కాలువ దాటేసి, ఒక్కసారి పరుగున ముంగిట్లోనుంచి యింట్లోకి దూసుకుపోయేది. ఓ కారణమూ గ్రటా లేకుండానే గభాలున యీ అత్త

గారిని కాగలించేసుకుని ముద్దెట్టుకునేది, తరవాత ఆ అత్తగారినీ కాగలించేసుకుని ముద్దెట్టుకునేది.

జమీల్యాకి పాటపాడడమంటే మహా యిష్టం. అస్తమానూ యేదో వొకటి అలా పాడుతూనే వుండేది, పెద్దవాళ్ల యెదట పాడడమా అని వొక్కసారైనా బిడియపడేదికాదు. ఇంటికోడలి విషయంలో మా గ్రామంలో అంగీకృతమైన నడవడికతో ఇదంతా సహజంగానే సరిపోవడంలేదు. అదే సర్దుకుంటుందిలే, అది ఇంకా చిన్నపిల్లేకదా అనీ మన చిన్నతనంలో మనమూ ఇలాగే వుండేవాళ్లమనీ అత్తగార్లిద్దరూ అనుకుని ఊరటపొందారు. నా మట్టుకు మాత్రం, ప్రపంచం అంతటిలోనూ జమీల్యాకంటె ప్రియమైనది మరొకతె లేదనే నా కనిపించింది. మేమిద్దరం కలిసికట్టుగా మహా సరదాగా వుండేవాళ్లం, పందేలు వేసుకుని వొకరివెంట వొకరం ముంగిటంతా పరుగెత్తేవాళ్లం.

జమీల్యా మంచి అందంగా వుండేది. దార్ఢ్యమైన శరీరం, వొయ్యారం వొలికే తీరు, బిగుతుగా జంట జడలుగా దువ్వుకున్న తిన్నని బిరుసుజుట్టు. తెల్లని రుమాలును తమాషాగా నుదిటిమీదకి వొక్కరవ్వ ఏమూలగా వచ్చేటట్టు తలపైన చుట్టుకునేదేమో, అది ఆమెకి చక్కగా అమరి ఆమె చామనచాయ ముఖానికి వింత విన్నాణం చేకూర్చేది. జమీల్యా నవ్వేటప్పుడు, ఆ కారునలుపు వాలుకళ్లు యౌవనోత్సుకతతో వెలిగిపోయేవి, ఇక తటాలున యే కొంటెగోంగూర పాటో పాడడం మొదలెట్టడంతో ఆ సొంపారు కళ్లు కన్యాయోగ్యంకాని మెరపులతో తళుక్కుమనేవి.

'జిగిత్తులూ' అందునా ముఖ్యంగా యుద్ధంనుండి తిరిగివచ్చేసిన సైనికులూ, ఆమెకేసి ఇంతింతలేసి కళ్లు అప్పగించి చూడ్డం నేను తరుచు గమనించుతూ వచ్చాను. వేళాకోళాలు ఆడడమన్నా హాస్యాలు చేయడమన్నా

జమీల్యాకి మహాసరదా. ఐనా, నిజం చెప్పాలంటే, ఆ పేరు చెప్పి ఎవళ్ళయినా పెంకెసరసాలు మొదలెడితే మాత్రం వాళ్ళకి వెంటనే బుద్ధిచెప్పేది. ఐనప్పటికీ ఇదిమాత్రం నాకెప్పుడూ కంటకంగానే వుండేది. ఆమెను చూసి అనుమానపడేవాణ్ణి — అక్కలను చూసి తమ్ముళ్ళు అనుమాన పడేటట్టే ఆమె సరసను యెవరైనా యువకులు వుండడం నా కంటబడినట్లాయెనా, పానకంలో పుడకలా నేనక్కడ తయారై వాళ్ళని అడ్డుకుందుకు ప్రయత్నించేవాణ్ణి. నేను పోట్లాటకి సిద్ధమవుతూ: "నవ్వుజాస్తీ అయిందంటే గూబగీమనగలదు, జాగ్రత్త! మా వదినెగారు, తెలుసాండి, ఆవిడెకి ఎవ్వరూ లేరనుకునేరు, ఖబడ్దార్!" అని వాళ్ళ మొహంమీద అన్నట్టుగా వాళ్ళకేసి కారాలూ మిరియాలూ నూరుతూ చూసేవాణ్ణి.

అటువంటి క్షణాల్లో నేను కావాలనే యెక్కడలేని చనవూ తీసుకుని సబబూ సందర్భమూ లేకుండా వాళ్ళ మాటల్లోకి చొరబడి, వాళ్ళని అవహాస్యం చెయ్యడానికి ప్రయత్నించేవాణ్ణి, కాని నా ప్రయత్నాలేవీ సాగక పోయే సరికి, నాకు వొళ్ళు వశంతప్పిపోయి, కోపంతో మూతి ఇట్టే పెట్టే వాణ్ణి.

ఆ కుర్రాళ్ళు ఫకాలున నవ్వేవారు:

"అరేయ్, వాణ్ణి చూడండ్రా! వాడి వదినెగారట ఈమె! అరే, యేమిటి యీ చిత్రం! మాకీ సంగతి తెలీదే!"

నేను రేగిపోయే వాణ్ణికాను, కాని చురచురమంటూన్న నా చెవులు నా కోపాన్ని బయటపెట్టేస్తున్నాయని నాకనిపించిపోయి, తలవంపులవల్ల కల్గిన బాధకి కన్నీటిబొట్లు కళ్లలో గిరగిర తిరిగేవి. వదినె జమీల్యా నన్ను అర్థం చేసుకునేది. తనలోనుంచి పొంగిపొరలుకొస్తూన్న నవ్వును ఆమె యెంతో కష్టంమీద ఆపుకొని, ముఖం గంభీరంగా పెట్టుకునేది.

"వదినెలు ఎక్కడపడితే అక్కడ రోడ్డుమీద దొరుకుతారనుకున్నారు కామోసు మీరు యేరుకుందుకు?" అని గొప్ప హుందాతనంతో ఆ 'జిగిత్తు'లను ప్రశ్నించేది. "మీ వూళ్ళో ఒకవేళ అలాయేమో గాని, మా వూళ్ళో మాత్రం అలా కాదు! రా, చిట్టీ, మనం వెళ్ళిపోదాం యిక్కడ్నుంచి!" అని జమీల్యా తలకాయ వెనక్కి విదిలించి, వాళ్ళని సవాలుచేస్తూ, బుజాలు ఎగరేసి, తనలో తాను చిరునవ్వు నవ్వుకుంటూ, నన్ను తీసుకొని వెళ్ళిపోయేది.

ఆ చిరునవ్వులో చికాకూ సంతోషమూ — రెండూ కనబడేవి నాకు. "ఓరి పిచ్చి వాగమ్మా! నాకు నిజంగా బుద్ధిపుట్టితే నన్ను ఆపగల్గే వాడెవడు? కుటుంబం అంతా నావెంటపడితే పడనీ — నామీద నిగా వుంచితే వుంచనీ!" అని అప్పుడు అనుకుంటే అనుకునేదేమో. అలాంటి సమయాల్లో నేను తప్పుచేసినవాడిలా మౌనంగా వుండిపోయేవాణ్ణి. అవును, జమీల్యాను చూసి నేను ఈర్ష్యపడ్డాను, ఆమెను ఆరాధించాను, ఆమె నా వదినెకదా అని గర్వపడ్డాను, ఆమె అందాన్ని చూసీ, ఆమె స్వతంత్ర బుద్ధీ సాహస స్వభావాన్నీ చూసీ గర్వపడ్డాను. మేమిద్దరం మంచి నేస్తులం, మా యిద్దరి మధ్యనూ రహస్యాలేవీ వుండేవికావు.

ఆ రోజుల్లో మగవాళ్ళు కొద్దిమందే వుండేవాళ్ళు గ్రామంలో. ఈ పరిస్థితిని ఉపయోగించుకుని కొందరు కుర్రాళ్ళు స్త్రీలపట్ల అమర్యాదగా ప్రవర్తించేవారు, వారిని చిన్నచూపుతో చూసేవారు. "ఆడాళ్ళకోసం అంత పాకులాడ్డం యెందుకురా? వేలితో సంజ్ఞచేశావంటే చాలు — ఎవర్తైపడితే అదే పరుగెత్తుకుంటూ వస్తుంది!" అనేవారు.

కోతరోజుల్లో ఒకవాడు మా దూరపుబంధువు ఒస్మాన్ జమీల్యాని అల్లరిపెట్టడం ఆరంభించాడు. తనంటే ఇహ యే ఆడదైనాసరే పడి ఛస్తుందనుకునే వాళ్ళలో వీడొకడు. జమీల్యా కోపంతో మండిపోయి ఒస్మాన్

చేయి తోసేసి, గడ్డిమేటు నీడను కూచుని విశ్రాంతి తీసుకుంటూన్నదల్లా లేచి నించుంది.

"ఇహ చాలు!" అంది వాడితో జమీల్యా, మనసులో బాధపడుతూ వెనక్కితిరిగిపోయి. "మందలో మగగుర్రాలు మీరు. మీకు యింతకంటె మంచి బుద్ధులు వుంటాయని యెలా అనుకోవడం."

గడ్డిమేటు పక్కను కాళ్ళూ చేతులూ పారజాపుకుని పడుకున్న ఒస్మాన్ ఈసడింపుగా తన తడిపెదవి విరిచాడు.

"తెడ్డుచివరనుండి వేలాడుతూన్న మాంసం తనకి అందలేదని, మాంసం కంపుకొడుతూందందిట పిల్లి!... మగాడు కావాలని పడిఛస్తూ, ఎందుకీ వేషాలంటా?" అన్నాడు ఒస్మాన్.

జమీల్యా ఛర్రున వాడికేసి తిరిగింది.

"అవును, నా క్కావాలేమో! మా నొసటరాత అలా వుంది. మరి, నువ్వు జడ్డివాడివి, నవ్వడంతప్ప నీకేమీ తెలీదు. యుద్ధంనుండి ఇంకా తిరిగిరాని సైనికుని భార్యగా నూరేళ్లయినా వుంటానుగాని నీలాంటివాడి మొహంమీద ఉమ్మనైనా ఉమ్మను — థూత్తేరీ! చూస్తున్నాను కదూ, ఇవి యుద్ధంరోజులు కాకపోయింటే నీతో ఎవర్తైనా మాటాడనైనా మాటాడి వుండదు!" అంది.

"నేనన్నదీ అదే! యుద్ధం వచ్చింది — మొగుడుచేత కమ్చీదెబ్బలు లేక పిచ్చెత్తిపోతున్నావు నువ్వు!" అన్నాడు ఒస్మాన్ పళ్లికిలిస్తూ. "ఒసేయ్, నవ్వు నా ఆడదానివైయుంటే మరోలా మాటాడివుండేదానివి!"

జమీల్యా వాడిమీద విరుచుకుపడి వాడికేదో జవాబు చెప్పివుండేదే, కాని వూరుకుంది: ఇలాంటి పనికిమాలినవాడితో కయ్యం పెట్టుకోగూడదని తెలుసు కుంది. వాడికేసి ఎంతోసేపు అలా రోతచూపులు చూసింది. ఆతర్వాత

అసహ్యంతో వుమ్మేసి, తను కిందపడేసిన పంగటిక్ర తీసుకుని అక్కడ్నుంచి చరచరా వెళ్లిపోయింది.

గడ్డికుప్ప వెనుకనున్న బండిలో నేను నించునున్నాను. జమీల్యా నన్ను చూసి, గిరున పక్కకు తిరిగిపోయింది. నా మనస్సు యే స్థితిలో వుండెనో ఆమె గ్రహించుకుంది. అవమానం జరిగినది ఆమెకుకాదు నాకేననీ, తలవంపు లన్నీ నాకే కల్గాయనీ నాకు యెంతగానో అనిపించిపోయింది. నేను మనస్సులో కుమిలిపోతూనే ఆమెను మందలించాను:

"ఇలాంటివాళ్లని నువ్వసలు దగ్గరకెందుకు రానిస్తున్నావంటా?"

సాయంకాలం వరకు జమీల్యా ధుమధుమలాడుతూ మొగం గంటు పెట్టుకుని తిరిగింది. వల్లెత్తుమాటైనా నాతో మాటాడలేదు. మామూలుగా మేమిద్దరం కలిసి ఎంతో నవ్వుకునేవారమా, అటువంటిది ఆమె పిసరంతైనా నవ్వలేదు. ఆమె దగ్గరకి నేను బండి తోలుకెళ్లేసరికి, తన మనస్సులో తను రహస్యంగా అనుభవించుతూన్నట్టి ఇందాకటి ఘోరమైన అవమానం గురించి నేను మాటాడేందుకు అవకాశం ఇవ్వకుండా వుండేందుకని, తన పంగటిక్రని గడ్డికుప్పలోకి గుచ్చి, చప్పున కుప్ప అంతటినీ పైకెత్తి, తన మొగం నాకు కనబడకుండా దాన్ని తనముందు ఎత్తిపట్టుకుని, బండిదగ్గర కొచ్చింది. గడ్డిని విసురుగా బండిలో వేసి, వెంటనే మళ్లీ మరో కుప్ప దగ్గరకెళ్లేది. బండి త్వరలో నిండిపోయింది. బండిని తోలుకెళ్లిపోతూ నేను వెనక్కి తిరిగి ఆమెకేసి చూశాను. ఆమె నిమిషం, రెండు నిమిషా లపాటు మొగం వేలేసుకుని అలా నించునుంది — పంగటిక్ర పిడిపైన ఆనుకుని దేనిగురించో గాని ఆలోచనలో మునిగిపోయుంది. ఆతర్వాత తను చేస్తూన్న పని గురించి జ్ఞాపకం తెచ్చుకుంది కాబోలు, మళ్లీ పని చూసుకోసాగింది.

కడపటి బండెడూ నింపుకున్న తరవాత, ప్రపంచంలో వున్న సర్వాన్నీ తను మరచిపోయినట్టుగా, సూర్యాస్తమానాన్ని చూస్తూ జమీల్యా యెంతో సేపు అలా నించుండిపోయింది. అక్కడ, నది యెదుటివొడ్డు కావల, కజఖ్ స్టెప్‌మైదానపు చిట్టచివరి అంచు యెక్కడైతే వుందో అక్కడ, కోతల కారులో పడమటాకసాన నీరసించిపోతూన్న సాయంసమయపు సూర్యుడు. మండుతూన్న 'తండిర్'*పొయ్యి నోటివలె జ్వలించాడు. సూర్యుడు మెల్లగా దిగ్మండలం వెనక్కి వెళ్లిపోయాడు, ఆకాశాన చివికిపోతూన్న చిరుమబ్బులను వెలుగులో ముంచెత్తుతూ, అప్పటికే లేతనీలి తొలిసంజ వెలుగులో మునిగిన పల్లపువేలుగల పాటలధూమ్రవర్ణపు స్టెప్‌మైదానంపై తన కట్టకడపటి కాంతులను విరజిమ్ముతున్నాడు. సూర్యాస్తమానాన్ని జమీల్యా ఎంతటి ప్రశాంత పారవశ్యంతో వీక్షించిందంటే, గంధర్వగాథల్లో వర్ణించబడిన దృశ్యం తనకి ప్రత్యక్షమైనట్టే వీక్షించింది. ఆమె ముఖం కోమలత్వంతో ప్రకాశించింది, సగం తెరచుకున్న పెదవులపైన పసిపిల్లల లలిత మందహాసం జీరాడుతూంది. నా నోటినుండి యింకా పూర్తిగా బయటకురాని నా మందలింపులకు జవాబు చెప్పడానికని జమీల్యా సరిగ్గా ఈ క్షణంలో నా వేపు తిరిగి, మా వెనకటి సంభాషణనే మేమింకా సాగించుతూన్నట్టుగా గొంతుకపెట్టి అంది:

"వాడి గురించి నువ్వేమీ మనసులో పెట్టుకోకు, చిట్టీ! వాణ్ణి గురించి అసలు పట్టించుకోకు! వాడూ ఓ మనిషేనా యేమిటి?..." దిగ్మండలంలోకి దిగిపోతూన్న సూర్యగోళపు అంచు చూస్తూ జమీల్యా ఒక్క నిమిషం వూరకుని,

---

* 'తండిర్' – రొట్టెలు కాల్చుకుందుకు, ఇంటి చేరువగా నేలలో కట్టిన గుండ్రని రంధ్రం వున్న పొయ్యి. – సం.

నిట్టూర్చి, సాలోచనగా తన మాటలు కొనసాగించింది: "మనిషి మనస్సులో యేమిటుంటుందో ఒస్మాన్ వంటివాళ్ళకి యేం తెలుస్తుంది? అది ఎవ్వరికీ తెలీదు.... అటువంటి మనిషి బహుశా ప్రపంచంలోనే లేడేమో...."

గుర్రాలను వేను యిటించటు మళ్లించుతూండగా, కాస్త దూరాన పనిచేస్తూన్న ఆడంగుల దగ్గరకి జమీల్యా తుర్రున పరుగెత్తింది. ఉత్తర క్షణంలో ఖంగుమంటూన్న నవ్వుల గొంతుకలు నా చెవినిబడ్డాయి. ఆమె అంతట్లో అలా మారిపోవడానికి యేం జరిగిందో చెప్పడం కష్టమే – సూర్యాస్త మానాన్ని చూస్తూండగా ఆ దృశ్యంవల్ల ఆమె మనసు ప్రభావితమైందేమో బహుశా, లేక ఆ రోజు బాగా పనిచేశాననే ఉల్లాసమే కల్గిందో మరి. బండినిండా యెత్తుగా నింపిన గడ్డికుప్పపైన కూచుని జమీల్యా వంక చూశాను. తలకి చుట్టుకున్న తెలుపురుమాలును ఆమె చర్రున తీసేసి చేతులు బారుగా చాపుకుని, నీడనున్న గడ్డికోసిన వచ్చికబయలు మీదనుండి తన నేస్తురాండ్రవెంట పరుగెత్తింది. ఆమె గౌనుఅంచు గాలిలో తపతప కొట్టుకుంటూంది. నా మనసులోవున్న విచారం కూడా తటాలున యెగిరి పోయింది: "ఆ ఒస్మాన్ చొల్లువాగుడు గురించి అసలు పట్టించుకోనే పట్టించుకోను!" అనుకున్నాను.

"చలో, చలో!" అని కొరడాతో చురుక్కుమనిపించి గుర్రాలను అద లించాను.

దళనాయకుడు నాకిచ్చిన సలహా ప్రకారం నే నానాడు నాన్నచేత తల గీయించుకుందుకని యింట్లోనే వుండిపోయి నాన్నకోసం కాచుక్కూచున్నాను. ఆలోపున అన్న సాదిక్‌నుంచి అందిన వుత్తరానికి జవాబు రాయడం మొదలె ట్టాను. వుత్తరాలు రాయడంలో సహితం పాటించాల్సిన నియమాలుండేవు

మాలో: అన్నలు నాన్న పేరటే ఉత్తరాలు రాసేవారు, గ్రామంలోవున్న పోస్టుజవాను ఆ ఉత్తరాన్ని అమ్మచేతికి అందజేసేవాడు; ఉత్తరాలు చదవడం, వాటికి జవాబు రాయడం నా పని. ఉత్తరం చదవడం మొదలు పెట్టకముందే, సాదిక్ అందులో యేమిటి రాశాడో నాకు తెలిసిపోయేది. వాడి ఉత్తరాలన్నీ, మందలో గొర్రెపిల్లల్లా వొక్క ఫక్కీలోనే వుండేవి. సాదిక్ ఎప్పుడూ కూడా తన ఉత్తరాన్ని: "నమస్కారములుచేసి వ్రాయునది" అనే మాటలతో మొదలెట్టేవాడు. తరవాత: "సువాసనలు పరిమళించుతూ పుష్పరాజములు వికసించే తలాన్ గ్రామవాసులైన మా అనుంగుబంధువులు: పూజ్యులూ ప్రియతములైన తండ్రిగారు జల్‌చు బాయ్," ఆ పేరు తర్వాత మా అమ్మ పేరు, ఆతర్వాత వాళ్ల అమ్మ పేరూ, ఆతర్వాత వయస్సు ప్రకారం యథావిధిగా వరుసక్రమం తప్పకుండా అందరి పేర్లూ రాసి, "....గార్లకు పోస్టుద్వారా యీ ఉత్తరం పంపడమైనది" అని ఉత్తరం సాగించేవాడు. ఇదైన తరవాత, ఇహ కుశలప్రశ్నలు – మా కులపెద్దలు 'అక్‌సకాలు'ల,* మా దగ్గరబంధువుల కుశలమూ యోగక్షేమాల గురించి తప్పనిసరైన ప్రశ్నలు – వుండేవి. వీటి తర్వాత చిట్టచివరని, మాటవరసకి రాసినట్టుగా: "నా భార్య జమీల్యాను కూడా అడిగినానని చెప్పవలెను" అని రాసేవాడు.

అవును మరి, తల్లితండ్రులు బతికివున్నప్పుడూ, కులపెద్దలూ దగ్గర చుట్టాలూ బతికి బాగున్నప్పుడూ ఉత్తరంలో మొట్టమొదటే పెళ్లాన్ని గురించి ఎత్తుకోగలడా ఎక్కడైనా? పెళ్లాంపేరే ఉత్తరం రాయడం అసలు చికాగ్గా వుంటుంది, అసభ్యంగా వుంటుంది కూడానూ. ఇది ఒక్క సాదిక్

---

* 'అక్‌సకాల్' – తెగవారందరిలోనూ వృద్ధుడు. – సం.

అభిప్రాయమే కాదు, ఆత్మగౌరవమున్న ప్రతీ మొగాడి అభిప్రాయమూనూ. ఈ విషయమ్మై ఇక యే వ్యాఖ్యానమూ అవసరంలేదు సరికదా, మా వూళ్లో అప్పుడే అదొక పద్ధతికింద స్థిరపడిపోయింది కూడా. ఇది యిలావుండగా, దీన్ని గురించి అసలు మేం ఆలోచించనే ఆలోచించలేదు – వుత్తరం అంటూ రావడమే ఎన్నాళ్లనుంచో యెదురుచూస్తూన్నట్టి సంతోషకరమ్మైనట్టి విశేషం కదా మరి.

ఆ వుత్తరాన్ని అమ్మ నాచేత యెన్నోసార్లు చదివివినిపించుకున్న తర్వాత, వొరిసి పగుళ్లుపడిన తన చేతుల్లోకి దాన్ని పూజ్యభావంతో తీసుకుంది. అదొక పిట్ట అయినట్టుగానూ, అది తుర్రని యెగిరిపోవడానికి సిద్ధంగా వున్నట్టుగానూ ఆ కాగితాన్ని పట్టుకుంది. వంచడానికి వశంకాని తన వేళ్లను యెంతోకష్టంతో కదుపుతూ ఆ వుత్తరాన్ని ఒక ముక్కోణాకారంలో మడతపెట్టింది.

"అయ్యో పిల్లలూ! మీ వుత్తరాలని రక్షరేకుల్లా భద్రపరచుకుంటాం!" అంది అమ్మ, కన్నీటితో వణకిపోతూన్న గొంతుకతో. "తండ్రీ, తల్లీ, బంధువులూ యెలా వున్నారని అడుగుతున్నారు మీరు.... ఎలావుండడానికీ మాకేమిటొచ్చింది గనక! స్వగ్రామంలో వున్నాం. మరి, మీరెక్కడున్నారో కదా? మేం బతికేవున్నామని ఒక్క పిసరంతమాట మీ దగ్గరనుంచి అందుతే చాలు – అంతకంటె మాకు మరేమీ అక్కర్లేదు...."

ఆ ముక్కోణపు మడతకేసి అమ్మ మళ్లీ యెంతోసేపు చూసేది తరవాత కడమ వుత్తరాలన్నిటినీ భద్రంగా వుంచుకున్న వొక తోలుసంచిలో యీ వుత్తరాన్ని కూడా వుంచి, ఆ సంచిని తన సందూకాపెట్టెలో పెట్టి దాచేసేది.

వుత్తరం అందే సమయానికి జమీల్యా యింట్లో వుండినట్టయితే

వుత్తరం చదువుకోమని ఆమెకిచ్చేవారు. ప్రతి సారీ ఆ ముక్కోణాన్ని ఆమె అందుకున్నప్పుడు ఆమె ముఖం యెర్రబారడం నేను గమనించేవాణ్ణి. తన దృష్టిని వుత్తరంలోని పంక్తులపై చరచర పోనిచ్చి ఆమె వుత్త రాన్ని ఆబగానూ తొందరగానూ మనసులో చదువుకునేది. కాని ఆమె వుత్తరం చివరికొస్తున్నకొద్దీ ఆమె బుజాలు మరింత సడలిపోసాగేవి, చెక్కిళ్ళ కాంతులు మెల్లగా అణగారిపోయేవి. తిన్నని కనుబొమలు ముడి పడేవి. ఇక కడపటి పంక్తులు చదవకుండానే వుత్తరాన్ని ఆమె ఎంతటి కటిక ఉదాసీనతతో అమ్మకి తిరిగియిచ్చేసేదంటే, ఎరువుతెచ్చుకున్న వస్తువును తిరిగి యిచ్చివేసినట్టే యిచ్చేసేది.

కోడల్ని అమ్మ తన పద్ధతిలో అర్థంచేసుకుని ఆ అమ్మాయిని ఉత్సాహ పరచుదామని నిశ్చయించుకుని అనేది, సందూకాపెట్టె మూసి తాళంవేస్తూ:

"ఇలా వుంటే యెలా చెప్పు? సంతోషంగా వుండడం పోయి మొగం యెలా వేలేసుకున్నావో! అయినా, యుద్ధానికి వెళ్ళినవాడు నీ మొగుడొక్కడేనా యేమిటి? ఈ కష్టం నీ వొక్కర్తికే కాదు — ప్రజ అంతా దుఃఖంలో మునిగుంది, ప్రజతో కలిసి ఓర్చుకోవాలి. మొగుళ్ళు యుద్ధానికెళ్ళిపోయారని బెంగ పెట్టుకుని విచారంగావున్న ఆడకూతుళ్ళు ఇహ దేశంమీద లేరనే అనుకుంటు న్నావా యేమిటి? నీకు విచారం వుంటుంది, నిజమే — కాని పైకి అలా అవుపడకూడదు, మనసులోనే వుంచుకోవాలి!"

జమీల్యా యేమీ అనేదికాదు. కాని మొండితనంతోనూ విచారంతోనూ నిండిన ఆమె చూపులు: "నీకేమీ అర్థంకాదు, అత్తయ్యా!" అన్న ట్టుండేవి.

ఈ సారి సాదిక్ దగ్గరనుండి వచ్చిన ఈ వుత్తరంపైన సరాతొవ్ పట్టణపు పోస్టుమార్కు వుంది. వాడు ఆ వూరు మిలిటరీ ఆస్పత్రిలో

వున్నాడు, దేవుడి దయవల్ల గాయాలనుండి కోలుకుని శరత్కాలానికల్లా యింటికొచ్చేస్తానని రాశాడు. దీని గురించి యిదివరకే రాశాడు, అందుకని వాడు త్వరలో యింటికి వచ్చేస్తాడని అందరం మహా సంతోషించాం.

ఇంతకీ వేనా రోజు యింట్లో వుండిపోనేలేదు, కళ్లందగ్గరకే పోయాను. నేను మామూలుగా అక్కడే పడుకుంటాను. గుర్రాల్ని లూసెర్న్ రొట్ట పెరుగుతూన్న బయల్లోకి తోలి, వాటి ముందుకాళ్లకి బందంవేశాను. మా పశువులు లూసెర్న్ గడ్డిబయల్లో మేతమేయడానికి సమష్టిక్షేత్ర అధ్య క్షుడు ఒప్పుకోలేదు, కాని మా గుర్రాలు పుష్టిగా వుండాలని చెప్పి, ఆ ఆజ్ఞని నేను లక్ష్యపెట్టలేదు. బయల్లోని పల్లపు జాగాలలో ఏకాంతంగా వున్న చిన్న చోటు నేనెరుగుదును. రాత్రిపూట అక్కడ యేమి జరిగినా యెవ్వరికీ యేమీ కనబడదు, యెవ్వరికీ యే అనుమానమూ తట్టదు. కాని ఈమాటు నా గుర్రాలకి ముందుకాళ్లకి బందంవేసి, లూసెర్న్ గడ్డి బయల్లో ఆ జాగాకి తీసుకెళ్లేసరికి, అక్కడప్పుడే ఎవరివో నాలుగు గుర్రాలు న్నాయి. వాటిని చూసి నాకు భలే కోపం వచ్చింది. ఎంతైనా నేను జోడు గుర్రాల బండి యజమానిని కదా, మరి కోపం తెచ్చుకోడానికి నాకు యెంతేనా హక్కుంది. నా సొంత జాగాలో అక్రమంగా కాలుపెట్టిన ఆ తలబిరుసు మనిషికి తగినపాఠం చెప్పడానికని నేను మంచిచెడ్డలు ఆలోచించ కుండా ఆ పరాయి గుర్రాల్ని అక్కడనుండి మరేచోటికైనా తోలేయడానికే నిశ్చయించుకున్నాను. కాని తటాలున కనిపెట్టాను — వాటిలో రెండు గుర్రాలు దనియార్‌వి. దళనాయకుడు ఉదయం నాతో చెప్పినది వీణ్ణి గురించే. దనియార్‌తో కలిసి రేప్పొద్దున్నే మేం స్టేషనుకి గింజ తోలు కెళ్లాల్సి వుంటుందన్న సంగతి జ్ఞప్తికి తెచ్చుకుని, ఇతగాడి గుర్రాల జోలికి పోకుండా వాటినక్కడే వుండనిచ్చి నేను కళ్లానికి తిరిగివచ్చేశాను.

కళ్లందగ్గర దనియార్ అవుపడ్డాడు. అతడు సరిగ్గా అప్పుడే తన బండి చక్రాలకి కందెనవేసి, వాటిని యిరుసుకి తగిలించి సీల బిగిస్తున్నాడు.

"వోయ్, దనియార్! పల్లంలో మేస్తున్నవి నీ గుర్రాలేనా యేమిటి?" అని అడిగాను వాణ్ణి.

"రెండు నావి."

"కడమ జత?"

"ఏమిటా అమ్మాయి పేరు? ఆఁ, జమీల్యా అంటారే ఆ అమ్మాయిది. ఆ అమ్మాయి మీ వదినె కదూ?"

"అవును, మా వదినే."

"దళనాయకుడు స్వయంగా ఆ రెండు జతల్నీ అక్కడికి తోలాడు. వాటిమీద ఓ కన్నువేసి వుంచమన్నాడు నన్ను...."

ఆ గుర్రాల్ని నేను తోలేయకపోవడం నయమే అయింది!

చీకటి పడింది, కొండమీదనుంచి వీచే సాయంకాలపు గాలి పడిపోయింది. కళ్లందగ్గర కూడా అంతా ప్రశాంతంగా వుంది. ఓ గడ్డికుప్ప దాపున దనియార్ నా పక్కనే సాగిలబడ్డాడు. కాని మరి కాస్సేపటికి లేచిపోయి, యేటొడ్డు కెళ్లాడు. అతడు అట్టే దూరం వెళ్లలేదు, అక్కడికి దగ్గరలో వున్న నిట్రటపు గట్టుమీద ఆగిపోయి, చేతులు వీపువెనక పెట్టుకుని, ఓ బుజంమీదకి తల కొద్దిగా వాల్చి అక్కడ నించున్నాడు. ఏటి ముఖంగా నిల్చున్నాడేమో, అతడి వీపే నాకు కనబడింది. పొడుగ్గా, కోణాలుతేరిన అతని విగ్రహం చెక్కినట్టు ఆ మెత్తని వెన్నెలవెలుగుల పూర్వరంగంలో నిశితంగా కానవచ్చింది. రాత్రి పూట మెరకల దగ్గర అంతకంతకు మరింత స్పష్టంగా అధికమవుతూన్న యేటి రొదను అతడు అతిశ్రద్ధగా వింటూన్నట్టుంది. అదేదో నా చెవులకు పట్టుదొరకని సువిశాల నిశీధినీ కంఠస్వరాన్ని అతడు వింటున్నాడేమో!

"ఈ రాత్రికి యేటొడ్డున గడపడానికే నిశ్చయించుకున్నాడేమో, పిచ్చివాడు!" అనుకుని నేను నవ్వుకున్నాను.

దనియార్ ఈ మధ్యనే మా గ్రామంలో ప్రత్యక్షమయాడు. ఓనాడు గడ్డి కోస్తున్న పొలం దగ్గరకి ఓ కుర్రాడు పరుగుపరుగున వచ్చి, గాయపడిన సైనికుడొకడు గ్రామంలోకి వచ్చాడనీ, వాడెవడో, ఎక్కడనుంచి వచ్చాడో తనకి తెలీదనీ చెప్పాడు. దానితో ఇహ ఇంతా అంతా గడబిడకాదు. గ్రామంలో యెలా వుండెనంటే: యుద్ధశ్రేణినుంచి యెవడైనా తిరిగి వచ్చాడనే సరికల్లా గ్రామంలో వున్న యావన్మందీ, చిన్నేమిటి పెద్దేమిటి ఆబాలగోపాలమూ, ఆ వచ్చినవాడెవడో చూద్దామనీ, వాణ్ణి పలకరించి, తమ బంధుమిత్రుల నెవరినైనా వాడు చూశాడేమో అని అడిగేందుకూ, విశేషాలు తెలుసుకుందుకూ కట్టకట్టకుని పరుగులమీద వచ్చేవారు. ఈసారి అక్కడ లేచిన కోలాహలం ఇక చెప్పలేం! ప్రతివారూ ఆశపడ్డారు, అన్నదమ్ముడే వచ్చాడో బావమరిదే వచ్చాడో అని. ఆ వచ్చిన మనిషి యెవడో చూదామని గడ్డికోతగాళ్లు అక్కడికి దూసుకుపోయారు.

దనియార్ అసలు మా గ్రామంవాడే అనీ, మా గ్రామంలో పుట్టి పెరిగినవాడే అనీ తేలింది. పసితనంలోనే తల్లితండ్రులు పోయారనీ, అనాధ బాలుడుగా వాణ్ణి ఈ యింటివాళ్లు కొన్నాళ్ళూ ఆ యింటివాళ్లు కొన్నాళ్లూ సాకారనీ, అలా మూడేళ్లపాటు అక్కడా అక్కడా పెరిగాడనీ, ఆతర్వాత — తల్లివంక బంధువులు కజాఖ్‌లు అవడంచేత చక్‌మాక్స్కి స్తెప్‌మైదానంలో వున్న కజాఖ్‌లదగ్గర వుండిపోయాడనీ చెప్పుకున్నారు. ఆ కుర్రాణ్ణి మా గ్రామానికి తిరిగి తీసుకువచ్చి దగ్గరపెట్టుకుందుకు వాడికి దగ్గరబంధువు లెవ్వరూ లేకపోవడాన్ని వాడిగురించి అందరూ మరచిపోయారు. స్వగ్రామం విడిచిపెట్టిన తర్వాత ఎలా గడుపుకొచ్చావు అని అడుగుతే ఆకుకి అందకుండా

పోకకి పోందకుండా జవాబు చెప్పాడు. ఏది యేమైనా, వాడు అష్టకష్టాలూ అనుభవించాడనీ, అనాథబాలుడుగా తిక్తజీవితాన్ని నోరారా చవిచూశాడనీ మాత్రం తేటతెల్లమవుతూనే వుండెను. నొసట రాసిన రాత వాణ్ణి, తిరగ మరగిన కాలులా, ఎన్నెన్నో వూళ్ళు తిప్పింది. వాడు చాలాకాలం చక్‌మాక్స్కి ఉప్పుబాడువల్లో గొర్రెలకాపరిగా పనిచేశాడు. పెద్దవాడైన తరువాత ఎడారిలో కెనాలు తవ్వకంలోనూ, పత్తిపండించే ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లోనూ పనిచేశాడు. ఆటుతర్వాత తాష్‌కెంట్ దగ్గర గనుల్లోనూ పనిచేశాడు. అక్కడ పనిచేస్తూన్నప్పుడే సైన్యంలోకి వెళ్ళాడు.

తన స్వగ్రామానికే దనియార్ తిరిగివచ్చేయడం గ్రామస్థులందరికీ నచ్చింది. "పరాయిచోట్ల యెన్ని తిరుగుళ్ళు తిరిగినా, మళ్ళీ స్వస్థలం చేరుకున్నాడూ అంటే, పుట్టినవూరి కాలువనీళ్ళు తాగడానికి వాడికి రాసి వుందన్నమాట. వాడు స్వభాష మరచిపోలేదు, అప్పుడప్పుడు కజాఖ్ మాటలు దొర్లినా, యాసలేకుండా శుభ్రంగా మాట్లాడుతాడు!" అన్నారు గ్రామస్థులు.

"తన మంద ప్రపంచం అవతలి కొసని వున్నప్పటికీ, 'తుల్‌పార్'* దాన్ని చేరుకుంటుంది. ఎవరి వూరు వారికి మంచి, ఎవరి బంధువులు వారికి ప్రీతి! బుద్ధిమంతుడివి కాబట్టి స్వగ్రామం చేరుకున్నావు. మాకు తృప్తిగా వుంది, నీ పితాళ్ళకీ తృప్తిగా వుంటుంది. దేవుడి దయవల్ల జర్మన్లని ఓడించేస్తాం, మళ్ళీ హాయిగా బతుకుతాం, మరి అందరిలాగానే నువ్వూ ఓ యింటివాడవవుతావు, నీ నట్టింట దీపం వెలుగుతుంది!" అన్నారు గ్రామ పెద్దలు.

---

* 'తుల్‌పార్' — గంధర్వగాథల్లో గుర్రం. — సం.

వాళ్ళు దనియార్ పుట్టుపూర్వోత్తరాలు తవ్వితీసి, వాడిది యే తెగో నిర్ణయించారు. ఆ విధంగా మా గ్రామంలో ఓ "కొత్త బంధువు" – దనియార్ – ప్రత్యక్షమయ్యాడు.

ముందుకు వంగిన బుజాలతో, ఎడమకాలు కుంటుతూన్న ఈ పొడుగాటి సైనికుణ్ణి ఒరొజ్మాత్ గడ్డికోతకి తీసుకొచ్చాడు. అతడు తన ఆర్మీ ఓవర్‌కోటును బుజంమీద పడేసుకుని, ఒరొజ్మాత్ స్వారిచేస్తూ కదం తొక్కుస్తూన్న టంగణా గోడిగెకి వెనకపడకుండా వుండేందుకని ప్రయత్నిస్తూ ఉద్రేకంతో అంగలేసుకుంటూ వచ్చాడు. పొడుగరైన దనియార్ పక్కను, గుర్రంపైన పొట్టిగా చెంగుచెంగున ఎగురుతూన్న దళనాయకుని చూస్తే, యెందుకోగాని, ఎడతెగకుండా తుళ్ళుతూన్న మంచినీటి వుల్లాముపిట్టే జ్ఞాపకంవచ్చింది. కుర్రాళ్ళందరూ ఫకాలున నవ్వారు.

దనియార్ కాలికి తగిలిన గాయం ఇంకా తిన్నగా మానకపోవడాన్ని మోకాలు వంగడంలేదు, అందుచేత కొడవలికోతకు అతడు పనికిరాలేదు. అందుకని అతణ్ణి దళనాయకుడు కోతయంత్రాన్ని పనిచేయిస్తూన్న కుర్రాళ్లం మాదగ్గరకి పంపించాడు. నిజం చెప్పాలంటే, అతడంటే మాకేమంత నచ్చలేదు. అన్నిటికంటే ముఖ్యంగా అతడు మాటామంతీ లేకుండా ముఖం ముడుచుకుని వుండడం మాకు మనస్కరించలేదు. దనియార్ నూటికీ కోటికీ ఓ మాట మాటాడేవాడేమో. మాటాడినప్పుడైనా ఆ సమయంలో అందుకు సంబంధించని మరేదో విషయం గురించి తను ఆలోచించుతూన్నట్టూ, తన తలపులు అదేమిటో వేరు అయినట్టూ, ఆలోచనలో మునిగి కలలుగంటూన్న ఆ కళ్లతో అతడు నిన్ను చూస్తూన్నప్పటికీ నువ్వు అక్కడ వున్నట్టు అతడు నిన్ను గమనిస్తున్నాడో లేదో నీకు అర్థం కానట్టూ నీకు అనిపిస్తుంది.

"వాణ్ణిచూస్తే జాలేస్తుంది! యుద్ధాన్నుంచి తిరిగొచ్చినా యింకా కోలుకోలేకుండా వున్నాడు పాపం!" అన్నారందరూ వాడి గురించి.

కాని అన్నిటికంటే చిత్రమైన విషయమేమిటంటే, దనియార్ ఇలా నిత్యమూ పరధ్యానంగానే వుంటూన్నప్పటికీ కూడా, పని మాత్రం త్వరగానూ సరిగ్గానూ చేసేవాడు. అతణ్ణి యెవరైనా తొలిసారి చూసినప్పుడు అతడు మంచి కలుపుకోలు మనిషి అనీ, మాయామర్మమూ ఎరగనివాడనీ అనుకుంటారు కూడా. తన మనసులోని అభిప్రాయాలనూ ఆలోచనలనూ తన మనసులో దాచివుంచుకోవడమే మంచిదని అనాధుడుగా కష్టాలు అనుభవించిన బాల్యం అతడికి నేర్పిందేమో, అతణ్ణి మితభాషిగా చేసేసిందేమో? బహుశ అదే అయ్యుండొచ్చు.

కొలకులదగ్గర లోతైన ముడుతలున్న దనియార్ పలుచని పెదవులు యెల్లప్పుడూ గట్టిగా బిగించుకునే వుండేవి, కళ్లలో విచారమూ నెమ్మదీ వుండేవి, పలచబడిపోయి యెప్పుడూ అలపుతోనే వున్న అతని ముఖానికి వంపుతేరి అస్తమానమూ కదలుతూన్న కనుబొమలు మాత్రమే జీవకళ యిచ్చేవి. అతడు అప్పుడప్పుడు, ఇతరులకి వినబడనిదేదో తను వింటూన్నట్టుగా, అతి అప్రమత్తుడై వుండేవాడు. అలాంటి సమయాల్లో అతడి కనుబొమలు పైకి యెగిరేవి, కళ్లు అర్థంకాని ఉత్సాహంతో వెలిగేవి. ఇక తరువాత అతడు చాలాసేపు అలా చిరునవ్వు నవ్వుతూండేవాడు, మరెందుకో గాని ఆనందంలో మునిగిపోయేవాడు. ఇదంతా మాకందరకీ వింతగా వుండేది. ఇదొక్కటే కాదు, అతడిలో ఇంకా మరికొన్ని చిత్రమైన విశేషాలుండేవి. మేం సాయంకాలం గుర్రాలని విప్పేసి, అందరం పాకచుట్టూ చేరి, వంటతను రాత్రిభోజనం సిద్ధంచేసి మాకు అందించేవరకూ కనిపెట్టుక్కూచునేవారం. కాని దనియార్ మాత్రం ఒక దిబ్బ ఎక్కిపోయి, చీకటిపడేవరకూ అక్కడే కూచునుండేవాడు.

"ఏమిటి చేస్తున్నాడక్కడ? ఎందుకని అలా కాసుక్కూచున్నాడబ్బా?" అని మేం నవ్వేవాళ్లం.

అదేమిటో తెలుసుకుందామనే జిజ్ఞాసతో నేనొకనాడు దనియార్ వెంట ఆ దిబ్బమీదకి వెళ్లాను. అసాధారణమైనదేదీ నాకక్కడ అవుపడలేదు. రక్త నీలపు సంధ్యారాగంలో మునిగిపోతూన్న స్తెప్‌మైదానం లోతట్టు కొండల పరిసరాలవరకూ విస్తరించివుంది. చీకటిలో మునిగిన నల్లని పొలాలు ప్రశాంతతలో మెల్లగా కరిగిపోతూన్నట్టున్నాయి.

నే నక్కడకి వచ్చిన సంగతి గురించి దనియార్ పట్టించుకోనే లేదు: అతడు అక్కడ కూచుని మోకాలి చుట్టూ చేతులు కడియం కట్టుకుని, యేమిటో ఆలోచించుకుంటూ ముక్కుసూటిగా దేనికేసో చూస్తున్నాడు, కాని అతని చూపులు తళ్కులీనుతున్నాయి. మళ్లీ నా కనిపించింది – నా చెవులకి సోకని చప్పుళ్లను అతడు యెంతో శ్రద్ధగా వింటూన్నట్టు. అతడు వుండివుండి చెవులు రిక్కించుకునేవాడు, కళ్లు వెడల్పుగా తెరుచుకునేవాడు. అతణ్ణి యేదో బాధపెట్టుతూన్నట్టుంది. ఇక అతడు లేచినించుంటాడనీ, తన మనోద్వారాలను బారుగా తెరుస్తాడనీ, కాని నా యెదట కాదనీ – వాడు నన్ను గమనించనేలేదు – నేనెరుగని బ్రహ్మాండమూ అనంతమూ అయినదేదో వొకదాని యెదట అనీ నాకు తోచింది. తరవాత నే నతడివైపు చూసేసరికి, అతణ్ణి పోల్చుకోలేకపోయాను: దనియార్ ముఖం వేలేసుకుని మందంగా కూచున్నాడు, రోజంతా పనిచేసిన తరవాత వూరికేనే విశ్రాంతి తీసుకుంటూన్నట్టుగా.

మా సమష్టిక్షేత్రపు గడ్డిపొలాలు కుర్కురేవ్ యేటి ముంపు భూముల అంచువెంట చెదురుమదురుగా వున్నాయి. మా గ్రామానికి చేరువనే కుర్కురేవ్ నది కొండకనుమలోనుంచి బయటపడి లోయవెంట

ఉరుకులతో నురుగులతో పట్టపగ్గాలులేకుండా ఉగ్రంగా శరవేగంతో ప్రవహించుతూంటుంది. సెలయేళ్లు పొంగులువారి పారే దినాల్లోనే గడ్డి కోతలు కూడానూ. సాయంకాలానికల్లా నురుగులు కక్కుతూన్న బురదనీరు పొంగడం మొదలెడుతుంది. అర్ధరాత్రి అయేప్పటికి ఘోరంగా రొజుకుంటూన్న యేటిరొదకి పాకలో పడుకున్న నాకు మెలకువ వచ్చేది. నీలంగా నెమ్మదిగా వున్న రాత్రి నక్షత్రాలు పాకలోకి తొంగిచూసేవి, చల్లనిగాలి లోపలికి దూసుకొచ్చేది. భూమి నిద్రపోతూంది. హోరున బొబ్బరించుతూన్న యేరు మాత్రం మా మీదకి భయంకరంగా ముంచుకొస్తూన్నట్టనిపించింది. మేం సరాసరి యేటొడ్డునే లేకపోయినప్పటికీ, రాత్రిపూట యేటినీరు యెంత దగ్గరగా వున్నట్టనిపించిందంటే అదాటుగా నాకు హడలెత్తుకొచ్చింది: వెంటనే యేరు పాకమీదకి విరుచుకునే పడుతుందో, పాకను యేకంగా ఈడ్చుకునేపోతుందో అని భయంవేసిపోయింది. మా జట్టువాళ్లు గడ్డికోతగాళ్ల కుంభకర్ణుడి నిద్రలో వున్నారు, నాకుమాత్రం కన్ను మూతపడలేదు, లేచిపోయి పాక బయటికి వెళ్లాను.

కుర్కురేవ్ ముంపుభూముల్లో రాత్రి అందంగానూ భయంకరంగానూ వుంటుంది. ముందుకాళ్లకి బందాలున్న గుర్రాల ఆకృతులతో పచ్చికబయలు అక్కడక్కడ నలుపెక్కుతూంది. మంచుతో చెమ్మగిలిన గడ్డిని గుర్రాలు కడుపెక్క మేశాయి, ఇప్పుడిక అవి అప్పుడప్పుడు బుసకొట్టుతూ యేమరుపాటులేని కునుకుపాట్లు తీస్తున్నాయి. ఆ పక్కనే, తడిసిన రోజ్‌విల్లో చెట్లను కిందకు వంగదీస్తూ వొడ్డుకు పరుగుతీస్తూన్న కుర్కురేవ్ నది తను మోసుకొచ్చిన శిలలను బోలు చప్పుడుతో దొర్లించుతూంది. నోరు మూతపడని ఆ యేరు భయంకరమైన రణగొణధ్వనితో రాత్రిని నింపుతూంది. హడలెత్తుకొస్తూంది. ఘోరంగా వుంది.

ఇలాంటి రాత్రులప్పుడెప్పుడూ నేను దనియార్‌ని తల్చుకునేవాణ్ణి. సరాసరి యేటిఒడ్డుపై వున్న గడ్డికుప్పమీద అతడు మామూలుగా పడుకునేవాడు. అతడికి భయంవేయలేదూ? ఆ యేటిహోరుకి అతడికి చెముడు రాకుండా ఎలా వుందో మరి? నిద్రపోతాడా లేక జాగరమేనా? తను వొక్కడూ యేటిగట్టున యెందుకు పడుకుంటాడు? వాణ్ణి ఏదైనా అక్కడకి ఈడ్చుకు పోతూందా యేమిటి? చిత్రమైన మనిషి! వాడు ఈ లోకంమీద మనిషి కాడు! ఇప్పుడెక్కడున్నాడో కదా? పక్కకి తిరిగి చూశాను — ఎవ్వరూ కనబడ లేదు. నెమ్మదిగా వాలుదిగుతూన్న కొండలు వొడ్డునుండి దూరందూరంగా వెళ్లిపోతున్నాయి, పర్వతపంక్తి చిట్టచీకటిలో భయంకరంగా కానవస్తూంది. అక్కడ, ఆ శిఖరాలపైన ప్రశాంతతా, నక్షత్రాలూ.

ఈపాటికప్పుడే దనియార్ వూళ్లోవాళ్లతో స్నేహంచేసి వుంటాడనే యెవరైనా అనుకుంటారు. కాని అలాంటిదేమీ జరగలేదు. అతడు మునపటి లాగానే యెవ్వరితోనూ కలవక వొంటరిగానే వుండేవాడు — స్నేహమూ శత్రుత్వమూ, సానుభూతీ, ఈర్ష్య అనే మాటలకి అర్థమే అతడికి అసలు తెలియదేమో అన్నట్టు. తననూ తన మిత్రులనూ సమర్థించుకో గలవాడూ, మంచిచేయగలవాడూ, ఒకోసారి చెడ్డ కూడా చేయగలవాడూ, పండుగల్లోనూ వేడుకల్లోనూ గ్రామపెద్దలకు తీసిపోకుండా పనులు నిర్వహించ గలవాడూ అయిన 'జిగిట్' అందరి మన్ననలూ అందుకుంటాడు, స్త్రీల దృష్టిని ఆకర్షిస్తాడు.

కాని మనిషి దనియార్‌లా, యెవ్వరితోనూ కలవకుండా గ్రామం దైనందిన వ్యవహారాల్లో అంటీముట్టకుండా వుండేవాడైతే, అట్టివాణ్ణి గురించి ఎవ్వరూ పట్టించుకోరు, కొందరు చిన్నచూపు చూసి, అంటారు కూడానూ:

"ఏదో పాపం, కడుపుకింత తెచ్చుకుంటూ బతుకు ఈడ్చుకొస్తున్నాడు, వాడి ఖర్మం మనకెందుకు...."

అలాంటి వ్యక్తిని తప్పనిసరిగా అందరూ తట్బాబాజా అయినా కడతారు, లేదా వాడిమీద జాలైనా పడతారు. మేం కుర్రకారులం — అసలైన 'జిగిత్తు' లతో మేమూ సమానమే అని అనిపించుకుందుకు మా వయస్సుకంటె పెద్దవాళ్లమైనట్టుగా ప్రవర్తించేందుకే యెల్లప్పుడూ ప్రయత్నించు తూండిన మేం — దనియార్ని చూసి, వాడి యెదటవాణ్ణి యేమనడానికీ ధైర్యంచాలక, వాడి వెనకాతలవాణ్ణి వేళాకోళం ఆడేవాళ్లం. దనియార్ తన ఆర్మీషర్టును తనే యేట్లో ఉతుక్కునేవాడని కూడా వాణ్ణి మేం వెటకారా లాడేవాళ్లం. వాడు షర్టు ఉతుక్కుని ఆరవేసుకునేవాడు, కాని అదింకా ఆరకుండానే దాన్ని తొడిగేసుకునేవాడు: వాడికి మారుషర్టు లేదుమరి.

కాని చిత్రమేమిటంటే, దనియార్ నెమ్మదిగానూ ముభావంగానే అవుపడినా, వాడితో సాయిలా పాయిలాగా వుండేందుకు మాకు దమ్ములు లేకపోయాయి. అందుకు కారణం వాడు మాకంటె పెద్దవాడని కానేకాదు, వాడు మాకంటె మూడేళ్లో నాలుగేళ్లో పెద్ద, అంతే, అయినా వాణ్ణి పెద్ద వాడిలా చూడక, 'నువ్వు' అని పిలవలేకపోయే వాళ్లమంటే వాడు గంభీరంగానూ, లేదా గోటుగానూ వుండడంవల్లనూ కాదు, ఆ గుణాలు వొక్కొక్క ప్పుడు గౌరవమర్యాదల వంటివాటిని ఉత్పన్నం చేసినందువల్లా కాదు. ఇదేమీ కాదు, అతడి మౌనంలోనూ, విచారంతో కూడిన ఆలోచనాతత్పరత లోనూ, మాకు అర్థంకానిదేదో వుండేది. ఎలాటి మనిషినైనా సరే వేళాకోళం చేయడానికి యెల్లప్పుడూ సిద్ధంగా వుండే మమ్మల్ని ఇదే వెనక్కిలాగేసేది.

వాడితో మేం ముభావంగా వుండడానికి ఒకానొక ఘటన కారణమై వుండొ

చ్చేమో. నేను మహా జిజ్ఞాసువుని, నా యక్షప్రశ్నలతో అందరినీ విసుగె త్తించేసేవాణ్ణి. యుద్ధశ్రేణినుంచి తిరిగివచ్చినవాళ్లని ప్రశ్నలువేసి యుద్ధం గురించి తెలుసుకోడమంటే నేను చెవికోసుకునేవాణ్ణి. దనియార్ గడ్డికోతకి మా దగ్గరకి వచ్చినప్పుడు, యుద్ధశ్రేణినుంచి తిరిగివచ్చిన ఈ సైనికుణ్ణి ప్రశ్నలువేసి యింకా మరేమైనా కొత్తసంగతులు తెలుసుకునే అవకాశంకోసం నేను యెప్పుడూ వెతకుతూనే వుండేవాణ్ణి.

ఓనాడు సాయంకాలం పని అంతా అయిపోయాక నెగడిచుట్టూ కూచుని, రాత్రిభోజనంచేసి హాయిగా విశ్రాంతి తీసుకుంటున్నాం.

"దనియార్! ఇహ నిద్దరోయేముందు యుద్ధం గురించి యేమైనా చెప్పరా, వింటాం" అన్నాను.

దనియార్ మొదట వూరుకున్నాడు, అంతేకాదు, వాడు కోపం తెచ్చుకు నుంటే కోపం తెచ్చుకునుండొచ్చు కూడా. వాడు అలా నిప్పుల్లోకి చూస్తూ మౌనంగా వుండిపోయాడు చాలా సేపు. ఆతరవాత తలకాయ పైకెత్తి మా వైపు చూశాడు.

"యుద్ధం గురించి అంటున్నావా?" అని అడిగి, తన మనస్సులో వున్న ఆలోచనలకే తను జవాబు చెబుతున్నాడేమో అన్నట్టుగా బోలు గొంతుకతో ఇంకా అన్నాడు: "వొద్దొద్దు, యుద్ధం గురించి మీకు తెలియక పోవడమే మంచిది!"

మరి కాస్సేపైన తరువాత అతడు వెనక్కితిరిగి గుప్పెడు యెండు టాకులు తీసి నెగడిలో పడేసి, మరి మా వేపు చూడకుండానే నిప్పు వూదడం మొదలెట్టాడు.

అంతకంటె మరేమీ చెప్పలేదు దనియార్. అయితే యేం, అత డన్న ఆ నాలుగు మాటలవల్లా యుద్ధం గురించి వూరికే పోసుకోలు కబు

ర్లాడుకోకూడదనీ, ఇది నిద్రపోయే ముందు చెప్పుకునే నాయనమ్మ కథ కాదనీ స్పష్టంగా అర్థమైంది. యుద్ధం మానవహృదయం లోలోతున వున్న రక్తాన్ని విరిచేసి కరడుకట్టించేసింది, దాన్ని గురించి తేలిగ్గా చెప్ప కోవడం అసాధ్యం. ఇలా అడిగినందుకు నా మట్టుకు నేనే సిగ్గుపడిపోయాను. ఇక ఆనాటినుండి నేనెన్నడూ దనియార్‌ని యుద్ధం గురించి అడగలేదు.

ఆ సాయంకాలం త్వరగానే మరపునపడిపోయింది. దనియార్ గురించి కూడా గ్రామంలో ఆసక్తి పోయింది.

మరునాడు పొద్దున్నే దనియారూ నేనూ గుర్రాల్ని కళ్లానికి తోలు కెళ్లాం. ఆ వేళకే జమీల్యా కూడా అక్కడికొచ్చింది. మమ్మల్ని అల్లంత దూరం నుంచే చూసి ఆమె కేకేసింది:

"ఓయ్ చిట్టీ, నా గుర్రాల్ని యిక్కడికి తోలుకురా! గుర్రపు సామానేదీ, ఎక్కడుంది?" తను పుట్టిన మర్నాటినుండీ బండి తోలుతూన్నట్టు, బళ్లని వ్యవహారసరళిలో తనిఖీచేయడం మొదలెట్టి, చక్రాల లోపలితొడుగు సరిగా వుందో లేదో అని చక్రాలను కాలితో తన్ని చూసింది.

దనియారూ నేనూ అక్కడికి బళ్లమీద వచ్చేసరికి జమీల్యాకి మా వాల కంలో యేమి వింత కనబడిందో గాని, మమ్మల్ని చూడగానే ఆమెకి నవ్వు పుట్టుకొచ్చింది. దనియార్ కాళ్లు పొడుగ్గా యెండిపోయున్నాయి. అవి బండి కుదుపుకి వూగులాడుతున్నాయి. కాళ్లకి వెడల్పాటి మూతులున్న టార్పాలిన్ బూట్లున్నాయేమో అవి యే నిమిషమే దసికిలిపోతాయో అన్నట్టు న్నాయి. మరి నేను – కావితేరి యించుమించు కారునలుపెక్కి జోళ్లులేని వుత్తకాళ్ల మడమలతో గుర్రాల్ని అదిలిస్తున్నాను.

"జత అంటే మీరే!" అంది నవ్వుతూ జమీల్యా తల యెగరేస్తూనూ. ఇక వొక్క క్షణమైనా ఆగకుండా, వెంటనే మామీద అధికారం చలా

యించుతూ అంది: ''ఎందుకు నానుపు? ఎండ మాడ్చేసేలోపునే మనం స్తెప్‌మైదానం దాటిపోవాలి!''

ఆమె గుర్రాల్ని కళ్లెంతో దృఢంగా పట్టుకుని, వాటిని బండి దగ్గరకి నడిపించి బండికి కట్టడం మొదలెట్టింది. ఆమె తనంతటతనే గుర్రాల్ని బండికి కట్టింది కూడానూ. లగాం యెలా బిగించడమో చూబెట్టమని వొక్కసారి మాత్రమే నన్నడిగింది, అంతే. దనియార్‌ని గురించి, ఆ మనిషి అసలక్కడ లేనట్టుగా, ఆమె పట్టించుకోనేలేదు.

జమీల్యా దృఢసంకల్పమూ, సవాలు విసరుతూన్నట్టే వున్న ఆమె ఆత్మవిశ్వాసమూ చూసి దనియార్ డంగెత్తిపోయినట్టయిపోయాడు. అమిత్రతతోనూ, అదేసమయంలో లోలోపునే దాచుకున్న ఆనందపరవశత్వంతోనూ అతడు ఆమెవంక విరోధభావంతో మూతిబిగించి చూశాడు. కాటామీద వున్న గోధుమబస్తాను అతడు మౌనంగా యెత్తి బండిదగ్గరకు మోసుకెళ్లినప్పుడు జమీల్యా అతడిమీద విరుచుకుపడింది:

''ఇదేమిటిది, ఇక్కడ యెవడిమటుకు వాడు తనంతట తనే వొళ్లు విరుచుకుని పనిచేస్తాడనుకుంటున్నావు కాబోలు! అదేం పనికిరాదిక్కడ, నేస్తం! ఇయ్యి, నీ చెయ్యి యిలా యియ్యి! ఏయ్, చిట్టీ, ఏమిటలా చూస్తున్నావ్! బండిలోకెక్కి బస్తాలు సర్దు!''

జమీల్యా తనంతట తనే దనియార్ చెయ్యి లంకించుకుంది, ఇద్దరూ చేతులు పట్టుకుని బస్తాను అడుగునుంచి ముంజేతులమీద యెత్తి బండిలో వేసేస్తూండగా, పాపం, దనియార్ సిగ్గుపడిపోయాడు, ముఖం యెర్రబడిపోయింది. ఇక తర్వాత వాళ్లిద్దరూ వొకరి మణికట్టు వొకరు పట్టుకుని ప్రతి బస్తా యెత్తి మోసుకెళ్లినప్పుడల్లా వాళ్లిద్దరి తలకాయలూ యించుమించు తగులుతూన్నంత దగ్గరగా వచ్చేసేవేమో అప్పుడు ప్రతిసారీ దనియార్

ఎంతగా చిత్రహింస అనుభవించుతూ సంకటపడిపోయేవాడో, యెంతగా బిడియపడిపోతూ పెదవి గిట్టకరచుకునేవాడో, జమీల్యా ముఖం కేసి చూడకుండా వుండేందుకని యెంతగా ప్రయత్నించేవాడో నేను పసికట్టేవాణ్ణి. ఇక జమీల్యా యిదేమీ పట్టించుకున్నట్టే కనబడలేదు. తన తోడిమనిషిని గమనించకుండా, తూనికవేస్తూన్న స్త్రీతో పరాచకాలు ఆడుతూనేవుంది. కాస్సేపటికి బళ్లనిండా బస్తాలువేసుకోవడం పూర్తి అయి, మేం కళ్లేలు చేతబుచ్చుకున్నాక, జమీల్యా కొంటెగా కన్నుగీటి నవ్వుతూ అంది:

''యేయ్ నిన్నేనోయ్! నీ పేరు దనియార్ కదూ? నువ్వు మొగాడిలా కనిపిస్తున్నావులే, అందుకని నువ్వే మొదట దారితీయ్!''

దనియార్ మళ్లీ మౌనంగానే వుండి, ఛటుక్కున బండి పోనిచ్చాడు. ''అయ్యో, దౌర్భాగ్యుడా, ఉన్నవన్నీ చాలనట్టు, నీకు ఈ సిగ్గు కూడా యెక్కడొచ్చి పడిందిరా!'' అనుకున్నాను.

మేం యెంతోదూరం వెళ్లాల్సివుండెను: స్తెప్‌మైదానం వరకు ఓ ఇరవై కిలోమీటర్లూ, తర్వాత లోయలోనుంచి రైల్వేస్టేషనువరకూ వెళ్లాలి. గుడ్డిలోమెల్ల అన్నట్టు, అంత దూరమూ రోడ్డు దిగుడు స్లోపుగానే వుంటుంది, అందుచేత గుర్రాలకి అంత కష్టం వుండదు.

మా కుర్కురేవ్ గ్రామం పెద్దకొండలనుండి దిగుతూన్న స్లోపుమీద యేటొడ్డున వుంది. నల్లని వృక్షశిఖరాల మధ్యనున్న మా గ్రామం కొండ కనుమలోనుంచి వెళ్తూన్నంత సేపూ కనబడుతూనే వుంటుంది. ఆతర్వాత మాత్రం మరి కనబడదు.

మేం రోజుకి రానూపోనూ వొక్క ట్రిప్పు మాత్రమే వెయ్యగల్గేవారం. పొద్దున్నే బయల్దేరితే, ఇహ స్టేషను చేరుకునేసరికి మధ్యాహ్నం దాటిపోయేది.

ఆనాడు ఎండ నిర్దాక్షిణ్యంగా మాడ్చేసింది, ఇహ స్టేషనులో జన సమ్మర్ధంవల్ల ముందుకు కదలడమే కష్టమైపోయింది: లోయ నలు మూలలనుండీ బస్తాలు వేసుకొచ్చిన తేలిక బళ్ళూ, భారీ నాటుబళ్ళూ కొండల్లో యెంతో దూరాన్నున్న సమష్టి క్షేత్రాలనుంచి గోధుమ మూటలు మోసు కొచ్చిన ఎడ్లూ, కంచరిగాడిదలూ – అన్నీ అక్కడ చేరుకున్నాయి. ఎండకి కావిదేరి నల్లబడిన ముఖాలూ, వెలిసిపోయిన గుడ్డలూ, దారిలో రాళ్ళూ రప్పలూ తగిలి పుళ్లడిపోయిన పుత్తకాళ్ళూ, ఎండతాపానికీ దుమ్మూ ధూళికీ పగిలి రక్తాలు కారుతూన్న పెదవులూ వున్న సైనికుల భార్యలూ పిల్లలూ వాటినక్కడికి తోలుకొచ్చారు.

రైలుస్టేషను ఆవరణలో గోధుమలు నిల్వచేసే షెడ్డు గేటుపైన: "ప్రతి గోధుమకంకీ యుద్ధశ్రేణికే!" అనే శీర్షిక వున్న పతాక కట్టివుంది. షెడ్డు ముంగిట బళ్ళతోలుకొచ్చినవాళ్ల గడబిడా, తొడతొక్కిడీ కేకలూ ఇక చెప్పశక్యంకాదు. ఆ పక్కనే వున్న పొట్టిగోడవెనుక ఇంజను వొకటి, దాని లైనుమీదకి రావడానికని ముందుకూ వెనుకకూ నడుస్తూ, దట్టంగా వున్న వేడి ఆవిరి ముద్దల్ని విరజిమ్ముతూ, మాడిన చిట్లెం వాసనను వెదచల్లుతూంది. దయ్యం పూనినట్టు కూస్తూన్న కూతలతో రైళ్ల పక్కనుండే ఝామ్మని దూసుకుపోయాయి. నేలపై చతికిలపడిన ఒంటెలు లేవడానికి ఇష్టంలేక, చొంగ కారుతూన్న వోళ్లను కోపంతో బారుగా తెరచి, తెంపరితనంతోనూ దుర్నాగ్రహంతోనూ బొబ్బరించాయి.

తోలుకొచ్చిన గింజల్ని పుచ్చుకునే చోట, ఎండకి చుర్రుమంటూ కాలిన ఇనుపరేకుల షెడ్డుకింద గోధుమరాసులు కొండల్లా వున్నాయి. సరాసరి రేకుకప్పుకింద వున్న బల్లకూర్పునిచ్చెన మీదకి బస్తాలు మోసుకుని యెక్కాలి.

ఘాటుగా వేస్తూన్న గోధుమగింజల వాసనా, దుమ్మూ ముక్కులోకి వెళ్లి పోతూంది.

"ఓయ్ అబ్బాయ్, జాగ్రత్త సుమా!" అంటూ సరుకు నమోదుచేసు కునే గుమాస్తా నేలమీద నించుని అరిచాడు. నిద్రలేకపోవడంచేత అతడి కళ్లు ఎర్రగా వున్నాయి. "మీదకి మోసుకుపోవాలి, సరాసరి మీదకే సుమా!" అని అతడు పిడికిలి ఝుళిపించి నోరారా ఓతిట్టు తిట్టాడు.

అతగాడు యెవరిని తిడుతున్నాడు? గింజల్ని యెక్కడికి మోసుకెళ్లాలో మాకు తెలుసును, అక్కడికి మోసుకెళ్తాం కూడానూ. ఎక్కడైతే ఆడాళ్లూ, ముసలితాతలూ పిల్లలూ విత్తులు చల్లి, మొక్కలు పెంచి గింజల్ని పోగుచేశారో, ఎక్కడైతే యిప్పుడు, ఈ సమయంలో తాపంతో సతమతమవుతూ, బాధా కరమైన డక్కామొక్కీలు తినితిని యేనాడో కాలంతీరిపోయి పాతడొక్కు అయిపోయిన కంబైన్ యంత్రంచేత పనిచేయించడానికని కంబైన్ డ్రైవరు బుర్ర బద్దలుచేసుకుంటున్నాడో, ఎక్కడైతే చెయ్యి వేస్తే చుర్రున కాల్తూన్న కొడవళ్లపైన నిరంతరం పీవులు వంచిన ఆడంగులు కోతలు సాగిస్తున్నారో, ఎక్కడైతే నేలరాలిన ప్రతి కంకినీ పసిపిల్లల చిన్నారి చేతులు అతి జాగ్రత్తగా యేరి పోగుచేస్తున్నాయో అచ్చంగా ఆ పొలాల్లోనుంచే ఈ గింజల్ని మేం స్వయంగా మా బుజాలమీద మోసుకొచ్చాం.

ఆ బస్తాలను మేం మా బుజాలపైన వేసుకునేసరికి అవి ఎంత బరువుగా వుండెనో నా కిప్పటికీ జ్ఞాపకం వుంది. నిజంగా అది ఫైల్మానుల్లాంటి వాళ్లు చెయ్యాల్సిన పని. బస్తా బుజానవేసుకుని, అడుగు వేసేసరికల్లా కిర్రుమంటూ వూగిపోతూన్న బల్లకూర్పునిచ్చెనపైన బాలెన్సుచేసుకుంటూ ప్రాణం పోయినా పట్టు జారిపోకుండా వుండేందుకని బస్తా ఒకకొసను పళ్లతో కరిచిపట్టుకుని నేను పైకెక్కాను. దుమ్ము గొంతుకలోకి దూరిపోయి

గొంతుక దురదేసిపోతూంది. వీపుమీదున్న బరువుతో పక్కయెముకలు సలిపే స్తున్నాయి, కళ్ల యెదట అగ్నిగోళాలు తాండవిస్తున్నాయి. బల్లకూర్పు విచ్చెన యెక్కుతూ సగం దారిలోనే నేను నిస్సత్తువైపోయి, ఆ బస్తాకి జాలీ కని కరమూ లేకుండా అది నా వీపుమీదనుండి కిందకి జారిపోతూందనీ, దాన్ని కిందకి గిరాటేసి దానితోపాటు నేను కూడా కిందకి దొర్లిపోతే పీడవదలి పోతుందనీ ఎన్నిసార్లు నే ననుకోలేదు! కాని నా వెనుక వస్తున్నారు మను షులు. వాళ్లు బస్తాలు మోస్తున్నారు, నా యీడువాళ్లు, నా యీడుకొడుకు లున్న సైనికుల భార్యలు. యుద్ధమే లేకపోయుంటే వాళ్లని యెవరైనా బస్తాలు మోయనిస్తారా? నేను నెరవేర్చుతూన్న పనినే ఆడవాళ్లు కూడా నెరవేర్చుతూండగా, అబ్బే, నేను వెనుకంజ వేయడానికి నాకు హక్కు లేదు.

అదుగో, జమీల్యా – పరికిణీ అంచు మోకాళ్లమీదకి దోపుకొని నాకంటె ముందు నడుస్తూంది, కావిదేరి యెంతో సొంపుగావున్న ఆమె కాళ్లకండరాలు వాటి శక్తిని చివరికంటా వినియోగించి ఎంత వాలుగా బిర్రబిగుసుకుంటు న్నాయో నాకు అవుపడుతూంది. బస్తా బరువుకింద విల్లులా వంగిపోయి, తన చిన్ని శరీరాన్ని యెంతటి యత్నంతో నిలకడగా వుంచగల్గుతూందో నాకు కనబడుతూనే వుంది. నేను అడుగడుగునా బలహీనపడుతూండడం తను గ్రహించినట్టు జమీల్యా అప్పుడప్పుడు క్షణమాత్రం ఆగుతూంది.

"కాస్త బలం చూపించు, చిట్టీ మరొక్క అడుగేలే!" అంటూంది.

కాని ఆమె గొంతుక మాత్రం నొక్కేసినట్టు బోలుగా ధ్వనించింది.

మేమక్కడ గింజలు వెలిపేసి, వెనక్కితిరిగేసరికి, దనియార్ మాకు యెదురువడ్డాడు. అతడు బల్లకూర్పు నిచ్చెనపైన కొద్దిగా కుంటుతూ, కొల్తకొలిచినట్టు దృఢంగా అంగలువేస్తూ, యెప్పట్లాగానే ఒంటరిగానూ మౌనంగానూ నడుస్తున్నాడు. మాకు యెదురై సరాసరి మాపక్కకి వచ్చేసరికి

దనియార్ ధుమధుమలాడుతూ చురకత్తుల్లాంటి చూపులతో జమీల్యాకేసి చూశాడు. ఇక ఆమె యెంతో ప్రయత్నంమీద వీపు నిటారుగా యెత్తి నలిగి పోయిన తన పరికిణీ సరిగా సర్దుకుంది. అతడామెను ప్రతిసారీ యెలా చూసేవాడంటే, ఆమెను అదే తొలిసారి చూసినట్టు చూసేవాడు, మరి జమీల్యా మాత్రం అతణ్ణి గమనించేదికాదు.

ప్రతిమాటూ యిలాగే జరిగేది: జమీల్యా అతణ్ణి చూసి వేళాకోళంగా నవ్వనైనా నవ్వేది, లేకుంటే అతడివైపు అసలు చూడడమే మానేసేది. అదంతా ఆమె మనస్థితినిబట్టి వుండేది. మేం రోడ్డువెంట బళ్లుతోలుకుని వెళ్తూండేవారమేమో, ఆమెకి యేమిటి తట్టేదో మరి, తటాలున: "ఏయ్, గుర్రాల్ని దౌడుతీయించుదాం!" అని నన్ను కేకేసేది. ఒక్క బొబ్బరింతతో, కమ్చిని యెత్తి తలపైన గాలిలో గిర్రునతిప్పి, గుర్రాల్ని దౌడుతీయించేది. నేనూ నా గుర్రాల్ని ఆమె బండివెంట దౌడుతీయించేవాణ్ణి. మేమిద్దరమూ దనియార్ని అందుకుని, అతణ్ణి దాటిపోయేవారం. మావెంట ముద్దమబ్బులా లేచిన ధూళి దనియార్ని చుట్టుముట్టేసి, యెంతసేపటికో గాని తేలి పోయేదికాదు. ఇది తమాషాకే చేసినా, యిలాంటి తమాషాను అందరు మగాళ్లూ సహించి వూరుకోరు. దనియార్ మాత్రం కోపం తెచ్చుకున్నట్టు అవుపించ లేదు. మేం దనియార్ పక్కనుంచి ఝామని దూసుకుపోయేవారం. బండిలో నిటార్గానించుని ఫకాలున నవ్వుతూన్న జమీల్యాను అతడు చిరచిరలాడుతూనే మెప్పుకోలుతో చూసేవాడు. నేను వెనక్కితిరిగి చూశాను. ఆ ధూళిమేఘంలో నుంచే దనియార్ జమీల్యాకేసి అలా చూస్తూన్నాడు. అతని చూపుల్లో అదేదో మంచితనమూ మన్నింపూ వుండినట్టు నాకు అనిపించింది, కాని ఆ చూపుల్లో మొండి పట్టుదలా, గుప్తమైన బెంగా కూడా నేను పసిగట్టాను.

తనను జమీల్యా యాగీ చేసినాసరే, తనపట్ల పూర్తిగా ఉదాసీనత

చూపినా సరే, దనియార్ మాత్రం చెక్కుచెదరకుండా నిగ్రహించుకునే వుండేవాడు. తనేదో ఒట్టుపెట్టుకున్నట్టు అన్నీ భరించేవాడు. మొదట్లో నా కతడిమీద జాలేసేది, అనేక సార్లు జమీల్యాతో అన్నాను కూడానూ:

"వాణ్ణి యెందుకలా యాగీచేస్తావ్, వదినా? వాడు ఒకరి జోలికివెళ్లే మనిషి కాడే!"

"ఓహో! అలాగా?" అని జమీల్యా నవ్వుతూ బుజాలెగరేసింది. "నేను ఉత్తినే గమ్మత్తుకే అన్నాననుకో. అయినా ఈ ముభావం మనిషి యేమీ అనుకోడులే!"

జమీల్యాకి యేవిధంగానూ తీసిపోకుండా నేనూ ఆనాటినుండి ఆరంభించాను దనియార్‌ని యెద్దేవా చేయడానికీ, వాడికి తాటాకులు కట్టడానికీనీ. వాడి వింతచూపులూ విడ్డూరపు చూపులూ చూసి మొదట్లో నాకు గాభరాగానే వుండెను. జమీల్యా బస్తా యెత్తి బుజాన వేసుకునేప్పుడు వాడు ఆమెవంక యెలా చూసేవాడు! అవును నిజమే, ఈ రణగొణ ధ్వనిలో, ఈ తొడతొక్కిడిలో, స్టేషను ఆవరణలో రేగుతూన్న ఈ సంతగొడవలో మనుషులు నలిగిపోయి గొంతుకలు బొంగురుపోయిన ఈ జనం మధ్య ఇదంతా ఇక్కడకాక మరెక్కడో విశాలప్రదేశంలో జరుగుతూన్నట్టుగా, జమీల్యాయొక్క నిబ్బరమూ నిలకడా, ఆచితూచిన చేతలూ, తేలిక నడకా అందరి కళ్లలోనూ పడింది.

మరి ఆమెను మెచ్చుకోకుండా వుండడం ఎవ్వరి తరమూ అయేది కాదు. బండిమీదనుంచి బస్తా దించేందుకని జమీల్యా నిటాగ్గా నిలబడి నడుంవంచి, బుజం వొడ్డి, తలకాయ వెనక్కి యెలా తాటించేదంటే, అందమైన ఆమె మెడ దిగంబరమై, యెండకి ఎర్రబడిపోయిన జడలు యించుమించు నేలను తాకేవి. తన పనిలో మునిగున్న దనియార్ వొక్క నిమిషం పని

కట్టిపెట్టి, ఆమె తలుపు దగ్గరకు చేరుకునేవరకూ ఆమెను తనచూపులతో వెంబడించేవాడు. తనను యెవ్వరూ చూడడంలేదనే ఆతడు నిశ్చయంగా అనుకునేవాడు. కాని దీనినంతా కనిపెట్టానేమో, నా మనస్సు విముఖతతో నిండిపోయింది, అంతేకాదు నాకు తీవ్రమైన అవమానం జరిగినట్టే అనిపించిపోయింది: జమీల్యా యెక్కడ, దనియార్ యెక్కడ, ఆమె చిటికినవేలి గోరుపాటి కూడా చేయడనే నా అభిప్రాయం.

"వీడే ఆమెవంక కన్నెత్తి చూస్తున్నాడూ అంటే – ఇహ కడమవాళ్లని యేమనడం!" అని మనసులో దుగ్ధపడ్డాను. నా కింకా వదలని కుర్రతనపు స్వాతిశయం ఈర్ష్యాగ్ని జ్వాలగా భగ్గున మండింది. తమవాళ్లు పరాయి వాళ్లపట్ల ఆపేక్షచూపడం చిన్నపిల్లలు చూసి యెల్లప్పుడూ అసూయ పడతారు. దనియార్‌మీద జాలి బదులు, వాడంటే నా కప్పుడు యెంత అనిష్టత అనిపించిపోయిందంటే, వాణ్ణెవడైనా తట్టాబాజా కట్టితే నేను మహాసంబరపడేవాణ్ణి.

అయినప్పటికీ దనియార్‌తో మేమాడిన వేళాకోళాలు ఒకనాడు అతి విచారకరంగా అంతమొందాయి. మేం బళ్లకేసుకుంటూన్న గోధుమ బస్తాలలో, ఉన్ని డ్రిల్లుగుడ్డతో కుట్టిన పెద్ద ఏడుపూడ్లు* బస్తా వొకటుంది. దీన్ని ఒక్క మనిషే మోసుకెళ్లడం అసాధ్యమని, మామూలుగా జమీల్యా నేనూ కలిసి మోస్తాం. దనియార్‌ని వేళాకోళం పట్టించడానికని ఓనాడు మేమిద్దరం ఓ తమాషా చేయడానికి నిశ్చయించుకున్నాం. ఆ పెద్ద బస్తాని మేమిద్దరం మోసుకెళ్లి దనియార్ బండిలో పడేసి, దానిపైన మామూలు బస్తాలు యెక్కించేశాం. దారిలో జమీల్యా నేనూ ఓ రష్యన్ గ్రామంలోనుంచి

---

* ఒక పూడుకి 16 కిలోగ్రాములు. – సం.

వెళ్తూండగా య్యెవరిదో ఒక ఆపిల్ తోట మాకు కనబడగా, అందులో చొరబడి ఆపిల్‌పళ్లు కోసుకొచ్చాం. ఇక దారిపొడుగునా నవ్వుతూనే వున్నాం. ఆపిల్పుని జమీల్యా దనియార్‌మీదకి విసరుతూంది. తర్వాత మామూలు చొప్పన మేమిద్దరమూ పెద్ద ధూళిమేఘం రేగేట్టుగా మా గుర్రాలను దౌడుతీయించి, దనియార్‌ని దాటిపోయాం. కనుమ దిగువనున్న లెవెల్ క్రాసింగు దగ్గర గేటు మూసివుండడంచేత, అక్కడ కలుసుకున్నాడు అతడు మళ్లీ మమ్మల్ని. అక్కడనుంచి ముగ్గురం కలిసే స్టేషనుకి బళ్లు తోలు కెళ్లాం. అదేమి ఖర్మమో గాని, ఆ ఏడు పూడ్ల బస్తామాట మేమిద్దరమూ శుభ్రంగా మరిచిపోయాం. బళ్లల్లోనుంచి బస్తాలు దించడం అయి పోయింది — ఇహ అప్పుడు జ్ఞాపకం వచ్చింది మాకు. జమీల్యా కొంటెగా నన్ను డొక్కలో పొడిచి, దనియార్‌వంక ఓరగా చూసింది. అతడు బండిలో నించున్నాడేమో, నించుని ఆ బస్తాకేసి ఆందోళనతో చూశాడు. దాన్ని యేమిటి చెయ్యడమా అని ఆలోచించుతూన్నట్టు అవుపడ్డాడు. తర్వాత వొక్క క్షణం అతడు అటూ యిటూ చూసి, జమీల్యా నవ్వు అణచు కుంటూాండడం గమనించేసరికి అతడి ముఖం య్యెర్రగా జేవురించిపోయింది: సంగతేమిటో అతడికి బోధపడిపోయింది.

"వంట్లాం పైకి ఎగలాక్కో, లేకుంటే దారిలో జారిపోగలదు!" అని జమీల్యా వాణ్ణి కేకేసింది.

దనియార్ మావంక కోపంగా చూపు సారించాడు. ఇక బస్తాను వాడు బండి లోపలనుండి కదిలించుతున్నాడన్న సంగతిని మేము గ్రహించుకోగల్గే లోపల వాడు, బస్తాని బండిమీదనుంచి యీడ్చి అంచున నిలబెట్టి, అది పడిపోకుండా దాన్ని వొకచేత్తో పట్టుకుని, తను బండినుంచి గంతేసి, బస్తాను తన వీపుమీదకి ఎక్కించుకుని అక్కడనుంచి నడిచి వెళ్లిపోయాడు.

దీంట్లో విశేషమేమీ లేదన్నట్టుగా మేము మొదట్లో నటించాం. కడమవాళ్లె వ్వరికీ యే అనుమానమూ తోచలేదు: అందరిలాగానే యీ మనిషి కూడా బస్తా మోసుకెళ్తున్నాడనుకున్నారు. కాని యెప్పుడైతే దనియార్ బల్లకూర్పు నిచ్చెన దగ్గరికి వెళ్లాడో, అప్పుడు జమీల్యా పరుగున వాడిదగ్గిర కెళ్లింది.

''బస్తాని గిరాటేసేయ్! నేనేదో హాస్యానికి వుంచానక్కడ'' అంది జమీల్యా వాడితో.

''పో యిక్కడ్నుంచి!'' అని దనియార్ స్పష్టంగా అని బల్లకూర్పు నిచ్చెన యెక్కసాగాడు.

''మోసుకెళ్తున్నాడు చూడు!'' అంది జమీల్యా నాతో, తనను సమర్థించుకుందుకు యత్నిస్తూన్నట్టుగా.

ఆమె యింకా మెల్లగా నవ్వుతూనే వుంది, అయితే తనకిక గత్యంతరంలేక నవ్వినట్టుందేగాని, ఆ నవ్వులో సహజత్వం యేమీ అవుపడలేదు.

దనియార్ గాయపడిన కాలుతో కుంటుతూండడం మేం గమనించాం. ఇది మాకు ముందుగానే యెందుకు తట్టిందికాదో మరి? ఆ మతి మాలిన హాస్యానికి ఈనాటికి సహితం నన్ను నేను క్షమించుకోలేకపోతున్నాను. ఆనాడు నాకేమి పిచ్చెత్తిందో మరి, అది అసలు నా బుర్రెలోనే పుట్టింది.

''వెనక్కొచ్చేయ్!'' అని కేకేసింది జమీల్యా, ఉల్లాసంలేని నవ్వులోనుండి.

దనియార్ వెనక్కి రాలేదు, వాడికి వెనక్కి వచ్చేదామని ఒకవేళ తోచినా, వెనక్కి రావడానికి వీల్లేదు కూడానూ: వాడి అడుగుల్లో అడుగులు వేసుకుంటూ వాడివెనకాలే వున్నారు మనుషులు.

ఇక తరవాత యేమయిందో నాకు యేమీ జ్ఞాపకంలేదు. బ్రహ్మాండమైన ఆ బస్తా బరువుకింద వాడు కుంగిపోవడం చూశాను, వాడి తలకాయ కిందికి వాలిపోయింది, మీదపళ్లు కిందపెదవిని గిట్టకరచుకున్నాయి. వాడు

నింపాదిగా నడుస్తున్నాడు, గాయపడిన కాలుని జాగ్రత్తగా ఈడుస్తున్నాడు. అడుగు తీసి అడుగు వేస్తున్నాడే గాని, వేసిన ప్రతి అడుగూ వాడికి యెంత బాధకలిగించుతూండెనంటే, వేసిన ప్రతి అడుగుతో పాటు తలకాయ ఛటుక్కున గంజాకుని, నిలువెల్లా క్రరకట్టిపోయినట్టు క్షణమాత్రం నిలబడిపోయేవాడు. అతడు బల్లకూర్పునిచ్చెనపైకి యెక్కుతూన్నకొద్దీ యిటూ అటూ మరింత హెచ్చుగా జోగిపోతున్నాడు. ఆ బస్తా వాణ్ణి ఊపేస్తూంది. అది చూసి నే నెంతగా భయపడి సిగ్గుపడిపోయానంటే నా గొంతుక శుభ్రంగా ఆర్చుకుపోయింది. హడలుతో వొళ్లు తిమ్మిరెత్తిపోయింది, అతడు మోస్తూన్న బరువు నేనే మోస్తూన్నట్టూ, గాయపడిన అతడి కాలు అనుభవించుతూన్న భరింప శక్యంగాని బాధను నా కాలే అనుభవించుతూన్నట్టూ నా శరీరంలో నరనరానికీ అనిపించింది. అదుగో, అతడు మళ్లీ మరోసారి జోగిపోతున్నాడు, మళ్లీ మరోసారి తలకాయ గింజాకుంటున్నాడు, నా యెదట వున్న సర్వమూ గిరగిర తిరిగిపోతూంది, కళ్లు చీకట్లు కమ్మేశాయి, కాళ్ల కింద నేలజారిపోయింది.

ఎముకలు విరిగిపోతాయేమో అన్నంత గట్టిగా యెవరో నా చేయి పట్టుకునేసరికి తటాలున నాకు మళ్లీ స్పృహ వచ్చింది. జమీల్యా నా చెయ్యి పట్టుకున్నట్టు నేను వెంటనే పోల్చుకోలేకపోయాను. ఆమె మొగాన నెత్తురు లేదు, తెల్లగా వెల్లబారిపోయుంది, బారుగా విప్పారిన మిడిగుడ్లలో కనుపాపలు బ్రహ్మాండంగా ఉబ్బిపోయున్నాయి. క్షణం క్రితం నవ్వుతో తొణుకుతూండిన పెదవులు ఇంకా అలా అదురుతూనే వున్నాయి. ఒక్కమేమిద్దరమే కాదు, బస్తాలు లెక్కవేసుకుంటూన్న గుమాస్తాతో సహా అక్కడుండిన యావన్మందీ బల్లకూర్పునిచ్చెన దగ్గిరకి చప్పున వరుగెత్తారు. దనియార్ మరొక రెండడుగులు వేసి ముందుకు నడిచాడు, వీపుమీదనుంచి

జారిపోతూన్న బస్తాని సర్దుకోవాలనుకున్నాడు — ఇక అతడి మోకాలు మణగి పోతూ, అతడు మెల్లగా కుంగిపోసాగాడు. జమీల్యా రెండు చేతులతోనూ ముఖం మూసేసుకుంది.

"జార్చేయ్, బస్తాని అక్కడ జార్చేయ్!" అని ఆమె కేకేసింది.

కాని దనియార్ మాత్రం, మరెందుచేతనో గాని, బస్తాని జార్చేయలేదు. తన వెనుకనున్నవాళ్లని అది పడతోయకుండా వుండేందుకని అతడు ఇంతకంటె బాగా బస్తాను తన బుజంమీదనుండి వొక పక్కగా బల్లకూర్పు నిచ్చెనమీదనుండి కిందకు జార్చేసి వుండగల్గేవాడే. జమీల్యా గొంతుక విని అతడు ముందుకు ఒరిగి, కాలు నిటాగ్గా వుంచుకుని మరొక అడుగు ముందుకు వేశాడు. వేసి, మళ్లీ జోగిపోయాడు.

"దాన్నక్కడ గిరాటేసేయరా, కుక్కలకొడకా!" అని గుమాస్తా గొంతుక చించుకుని అరిచాడు.

"గిరాటేసేయ్!" అంటూ జనం అరిచారు.

దనియార్ ఈ సారి దృఢంగా నిలబడ్డాడు.

"అబ్బే, వాడు గిరాటెయ్యడు!" అన్నారెవరో నమ్మకంతో.

బల్లకూర్పునిచ్చెనపైన అతడి వెనుక నడుస్తూన్నవాళ్లకీ కిందనున్న వాళ్లకీ అందరికీ కూడా అర్థమైనట్టే వుంది: ఆ బస్తా కిందకి జారిపడి, ఆ పాళంగా అది వాణ్ణి కూడా కిందకి తిరగతోసెయ్యాలే తప్ప, వాడు మాత్రం దాన్ని వదలడని. మృత్యుసదృశమైన నిశ్శబ్దం అలముకుంది. దాన్ని పటాపంచలుచేస్తూ గోడ అవతలున్న ఇంజను ఖైంయ్‌మని కూసింది.

దనియార్ పిశాచం పూనినవాడిలా జోగిపోతూ, అడుగువేస్తే వంగి పోతూన్న బల్లకూర్పునిచ్చెనమీద నడిచి, ఎండవేడికి చుర్రుమని కాల్తూన్న

ఇనుపరేకు పైకప్పుకిందకి వెళ్ళాడు. రెండేసి అడుగులు ముందుకు వేయనూ, బాలెన్సు నిలుపుకుందుకని ఆగిపోనూ, శక్తి పుంజుకుని మళ్ళీ రెండడుగులు ముందుకు వేయనూ — అలా వుండుండి నడుచుకుని ముందుకువెళ్ళాడు. వాడివెనుక నడుస్తూన్నవాళ్ళు అతడి అడుగులతో సమానంగా అడుగులు కలిపి నడిచేందుకు ప్రయత్నిస్తున్నారు, వాడు ఆగిపోయినప్పుడల్లా వీళ్ళు కూడా ఆగిపోతున్నారు. ఈ నడక వాళ్ళని నిస్త్రాణపరచేస్తూంది, వాళ్ళకున్న రవంత శక్తినీ వీళ్ళకార్చేస్తూంది. అయినప్పటికీ దీనివల్ల వాళ్ళలో వొక్కరికైనా కోపంరాలేదు, వొక్కరి నోటంబైనా పళ్లెత్తు తిట్టుమాట కూడా రాలేదు. వారందరూ అదృశ్యరజ్జువుచే బంధించబడి ప్రమాదభరితమైనట్టీ, జారుగా వున్నట్టీ బాటపై నడుస్తూన్నట్టూ, ప్రతి వొక్కరి ప్రాణమూ రెండవవారి ప్రాణంపైన ఆధారపడివుండినట్టూ వారు తమ బరువులు మోసుకుని నడిచారు. వారి అంగీకృతమౌనంలోనూ, ఏకరీతి ఊగులాటలోనూ వొకటే భారమైన లయ కానవచ్చింది. దనియార్ వెంట వొక అడుగు, మరొక అడుగు, ఇంకా మరొక అడుగు, మరొక అడుగు. వాడివెనుక పళ్ళు బిగించి అలా అడుగులువేస్తూ నడుస్తూన్న సైనికుని భార్య యెంతటి యమయాతనతో, యెంతటి వేడుకోలుతో వాడివంక చూస్తున్నదో కదా! తన అడుగులే అసలు తొట్రుకుంటూ పడ్డాయి, అయినప్పటికీ ఆమె అతడికోసం ప్రార్థించింది.

ఇహ కొద్దిపాటి దూరమే వుండిపోయింది, మరి రవంత ఎగుడు యెక్కితే బల్లకూర్పునిచ్చేవ కడవరకూ యెక్కినట్టే. కాని దనియార్ మళ్ళీ యిటూ అటూ తూలిపోసాగాడు. గాయపడిన కాలు అతడి స్వాధీనంలోనుండి తప్పిపోయింది. ఇక వాడు బస్తా గనుక గిరాటేయకపోయినట్టయితే మాత్రం, యే క్షణమే కిందకి తిరగబడిపోతాడో అన్నట్టు అవుపడ్డాడు.

"పరుగెత్తి వెళ్లి వెనకనుంచి పట్టుకో!" అని జమీల్యా నన్ను కేకేసింది, తను నిరాశతో రెండు చేతులూ యెగరేసింది, అందువల్ల అతనికేదో సహాయం జరిగేటట్టు.

నేను బల్లకూర్పునిచ్చెనమీదకి దూసుకుపోయాను. మనుషుల మధ్య నుండీ బస్తాల మధ్యనుండీ దారిచేసుకుంటూ దనియార్ దగ్గరకి పరుగెత్తాను. వాడు తన చంకకిందనుండి నన్ను చూశాడు. నల్లబారుతూ చెమ్మగిలిన నుదుటిమీది నరాలు పొంగివున్నాయి, నెత్తురులా యెరుపెక్కిన కళ్లు నన్ను ద్వేషంతో దహించివేశాయి. బస్తాను వెనకనుండి పట్టుకోబోయాను.

"ఫో, ఇక్కడ్నుంచి!" అని దనియార్ రాపుగొంతుకతో గర్జించి, ముందుకు నడిచాడు.

భారంగా ఊపిరితీస్తూ, కుంటుకుంటూ దనియార్ కిందకి దిగిపోయే ప్పటికి, వాడి చేతులు చెక్కబద్దల్లా వేలాడిపోతున్నాయి. వాడికి అందరూ మౌనంగా తోవయిచ్చేశారు. గుమాస్తా ఇహ వుండబట్టలేక కేకేశాడు:

"నీకు పిచ్చెత్తిందా యేమిటి? నేను మనిషినా మానునా? ఆ బస్తాని కిందనే వెలపనిచ్చేవాణ్ణిగా! అలాంటి బస్తాలు యెందుకు మోసుకొస్తున్నావ్?"

"అది నా వ్యవహారం" అని దనియార్ మెల్లగా జవాబుచెప్పాడు.

వాడక్కడ తుప్పన వుమ్మేసి, తన బండిదగ్గరకి వెళ్లిపోయాడు. వాడివంక కన్నెత్తి చూసేందుకు మాకు ధైర్యం చాలిందికాదు. మేం సిగ్గుపడి పోయాం, మేం తెలివిమాలి చేసిన పరిహాసాన్ని అంత తీవ్రంగా తీసుకున్నం దుకు వాడిమీద మేం లోలోపల మండిపడ్డాం.

ఆ రాత్రంతా మా తిరుగుప్రయాణం మౌనంగానే గడచింది. వాడికి మౌనం సహజమే. అందుకని వాడికి మామీద రోషమే వచ్చిందో, లేక ఆ సంగతంతా వాడప్పుడే మరచిపోయాడో మేం తెలుసుకోలేకపోయాం.

మేము మాత్రం అతి గాభరా పడిపోయాం, మా మనస్సు మమ్మల్ని మహా పీక్కుతింది.

మర్నాడు పొద్దున్న కళ్లందగ్గర మేం బళ్లకి బస్తాలు వేసుకుంటూండగా ఆ పాపిష్టి అంకేన్ని జమీల్యా లంకించుకుని దాని మూతి అంచుమీద కాలేసి, రెండో అంచుని చేత్తో పుచ్చుకుని ఫర్రుమని చించిపారేసింది.

"ఇదిగో, నీ గోనెగుడ్డ!" అంటూ దాన్ని, విస్తుపోయి చూస్తూన్న కాటా మనిషి మొగంమీద గిరాటేసింది. "దళనాయకుడితో చెప్పు యిలాంటి అంకేల్ని ఇహ యెన్నడూ మాకు అంటకట్టొద్దని!"

"దీనికేమొచ్చింది? ఏమిటిదంతా?"

"ఏమీ లేదులే!"

ఆ మర్నాడంతా దనియార్ తన కోపాన్ని రవంత కూడా పైకి అవుపడనివ్వలేదు. మనిషి యేమీ తొణకలేదు. మౌనంగానే వున్నాడు. కాని మామూలు కంటె కూడా హెచ్చుగా, అందులోనూ బస్తాలు మోసేప్పుడు ఇంకా హెచ్చుగానూ, కుంటుతూ నడిచాడు. పాత గాయం నిన్న మళ్లీ పచ్చిచేసినట్టుంది. వాణ్ణి చూసినప్పుడల్లా, వాడిపట్ల మేం చేసిన తప్పు మాకు అస్తమానూ జ్ఞాపకం వస్తూనే వుండేది. అయినదేదో అవనే అయింది కదా, పోనీ, వాడు ఓ నవ్వు నవ్వేసి వుండినా, లేదూ మమ్మల్ని వెటకారమాడి వుండినా మాకు కాస్త బాధ తగ్గేది — మా నేరం సంగతి మేం మరచిపోయుండేవారం.

జమీల్యా కూడా, దనియార్‌లాగానే, అసాధారణమైనదేదీ జరగనట్టే పైకి అవుపడడానికి ప్రయత్నించింది. అభిమానంగల మనిషేమో, అంతా

మామూలుగా వున్నట్టు నవ్వేసింది కాని, ఆ రోజంతా ఆమె మనసు మన సులో లేదని నేను గ్రహించేశాను.

ఆ రోజు మేము స్టేషన్నుంచి బయల్దేరేసరికి బాగా ఆలస్యమై పోయింది. దనియార్ తన బండి తోలుకుని మాకంటె ముందర వెళ్తున్నాడు. రాత్రి మహా దివ్యంగా వుంది. ఆకాశాన అతి దూరంగానూ, అయినా అతి సామీప్యంలో వున్నట్టే కనబడుతూన్న నక్షత్రాలతో దేదీప్యమానంగా వెలిగి పోతూన్న ఆగస్టు మాసపు రాత్రులను యెవరెరుగరు గనుక! ప్రతి చిన్న నక్షత్రమూ స్పష్టంగా కనబడుతుంది. అయినా వాటిలో ఒక నక్షత్రం వుంది: దాని అంచులు తుషారంతో కప్పినట్టూ, ఊర్ధ్వాన మిలమిల ప్రకా శించుతూన్న దాని హిమకిరణాలన్నీ అంధకారబంధురమైన ఆకాశంనుండి భూమివంక అమాయకమైన ఆశ్చర్యంతో చూస్తూన్నట్టూ అవుపడింది. మా బళ్లు కొండకనుమలోనుంచి వెళ్తున్నాయి. నే నెంతసేపూ ఆ నక్షత్రం వంక అలా చూస్తూనే వున్నాను. ఇంటిముఖంపట్టిన గుర్రాలు ఇష్ట పూర్వకంగానే కదంతొక్కి పరుగెత్తుతున్నాయి, రోడ్డుమీద వున్న గలకరాళ్లు బండిచక్రాలకింద నలిగి కరకరమంటున్నాయి. స్తెప్మైదానంమీదనుండి వీస్తూన్న గాలి, మంచి పూతలోవున్న వర్మ్వుడ్ పుప్పొడుల చేదువాసనలను అక్కడనుండి మోసుకొస్తూంది, గింజ ముదురుతూన్న తొలికారు గోధుమ తన నెత్తావులను తగుమాత్రంగా వెదచల్లుతూ, గాలిలోని తిక్తాన్ని అణచి వేస్తూన్నప్పటికీ, ఇదంతా తారు వాసనతోనూ, గుర్రాల చెమటకి చెమ్మగిలిన తోలుసామానునుండి వస్తూన్న దుర్గంధంతోనూ మిళితమై దీనితో తల కొద్దిగా తిరగడం ఆరంభించింది.

లోయకి ఒక పక్కను, ముళ్లపొదలు పెరిగిన కొండలు రోడ్డుమీదకి ఒరిగివున్నాయి. రెండవ పక్కను, కింద అగాధంలో మొలుస్తూన్న ఎరుపు

విల్లో, అడవి పోప్లార్ చెట్ల మధ్యనుండి చపలచిత్తయైన కుర్కురేవ్ నది హోరునపారుతూంది. అప్పుడప్పుడు యెక్కడనుండో వెనుకనుండి వచ్చిన రైలు వొకటి క్షణమాత్రపు గర్జనతో వంతెనమీదనుండి ఝూమని వెళ్లి పోయేది, ఖణేలుఖణేలు మంటూన్న దాని చక్రాల ధ్వని అది అదృశ్యమైపోయిన యెంత సేపటివరకో దానివెంట పరుగెత్తేది.

ఆ చల్లని రాత్రివూట బండి తోలుకెళ్తూండడం, గుర్రాల వీపులు కిందకీ మీదకీ కదులుతూండగా చూస్తూండడం ఆగస్టు నిశీధినీ ధ్వనులను వింటూండడం, దాని పరిమళాన్ని ఆఘ్రాణించడం ఎంతో హాయనిపించింది! జమీల్యా నాకంటె ముందు వెళ్తూంది. కళ్లేలని ఆమె వదిలేసి, యిటూ అటూ పరకాయించి, అదేదో పాట మెల్లగా పాడుతూంది. మా మౌనాన్ని ఆమె భరించలేకుండా వుండేనన్న సంగతి నాకు అర్థమైంది. ఇలాంటి రాత్రప్పుడు మౌనంగా వుండడం దుస్సాధ్యం. ఇలాంటి రాత్రప్పుడు పాట పాడితీరాలనిపిస్తుంది.

ఇక ఆమె పాడడం ఆరంభించింది. దనియార్‌కీ మాకూ వుండిన వెనుకటి సయోధ్యని యెలాగో మళ్లీ నెలకొల్పాలనే వాంఛ ఆమె పాట మొదలెట్టడానికి బహుశ కారణమై వుంటుంది. అతడిపట్ల తను అపచారం చేశాననే ఆవేదనను తన మనసులోనుంచి యెలాగైనా పారదోలాలని ఆమె కాంక్షించడం కూడా బహుశ కారణమై వుంటుంది. ఆమె గొంతుక ఖంగుమంటూ ఉత్సాహంగా వుంటుంది, మరి "రుమాలు వూపుతూ నీకు వీడ్కోలు చెబుతా," "ప్రియుడెళ్లి పోయాడే, నన్నొదిలెళ్లిపోయాడే" — ఇలాంటి మామూలు పల్లెటూరి పాటలే ఆమె పాడేది. ఆమెకెన్నో ఎన్నో పాటలొచ్చు, యే ఆర్భాటమూ లేకుండా సహజంగానూ భావోద్రేకంతోనూ పాడేది, అందుచేతే ఆమె పాడుతూంటే వినడానికి ఎంతో హాయిగా

వుండేది. ఆమె పాట పాడుతూ, పాట మధ్యలో ఛటుక్కున ఆగిపోయి, దనియార్‌ని కేకేసింది:

“ఏయ్ దనియార్, నువ్వేదేనా పాట పాడవోయ్! నువ్వు ‘జిగిత్’వి కావా యేమిటి?”

“నువ్వే పాడుదూ, జమీల్యా! నువ్వే పాడు!” అని దనియార్ కంగారు పడుతూ జవాబుచెప్పాడు, కళ్లేన్ని వెనక్కి లాగి, గుర్రాల్ని ఆపుచేస్తూ. “రెండు చెవులూ అప్పగించి వింటాను!” అన్నాడు.

“ఏం, మాకు చెవులు లేవనుకున్నావా? మాకూ వున్నాయ్, మేమూ వినగలం! పోన్లే, నీ కిష్టంలేకపోతే వొద్దులే!” అనేసి జమీల్యా తన పాట మళ్లీ ఆరంభించింది.

వాణ్ణి పాడమని యెందుకు అడిగిందో యెవరు చెప్పగలరు? ఊరికేనే అడిగిందో మరి, లేకుంటే వాణ్ణి మాటల్లోకి దించడానికే అడిగిందో? వాణ్ణి మాట్లాడించాలని ఆమె చాలాసేపట్నుంచి అనుకుంటూన్నట్టే వుండాలి, ఏమంటే మరొక్క గడియసేపు వూరుకుని, ఆమె మళ్లీ కేకేసింది.

“దనియార్, ఓ సంగతి అడుగుతాను, చెప్పు. నువ్వెప్పుడైనా ఎవ రినైనా ప్రేమించావూ?” అని అడిగి, ఫక్కున నవ్వింది.

దనియార్ యేమీ జవాబుచెప్పలేదు. జమీల్యా కూడా యేమీ మాట్లాడలేదు.

“దొడ్డవాణ్ణే అడిగింది పాడమని!” అని నాలో నేను వ్యంగ్యంగా నవ్వుకున్నాను.

రోడ్డుకి అడ్డంగా పారుతూన్న యేటిదగ్గరకొచ్చేసరికి గుర్రాలు ఆగి పోయి వాటి లాడపు డెక్కలతో, వెండిలా మెరుస్తూన్న తడి రాళ్లపైన టకటక చప్పుడుచేస్తూ మెల్లగా నడవసాగాయి. పాటిరేవు దాటిన తరవాత

దనియార్ గుర్రాల్ని కమ్చీతో ఒక్క చరుపుచరిచి, గతుకుల కుదుపుకి తేలిపోతూన్న అవరుద్ధకంఠంతో ఉన్నట్టుండి పాటపాడడం మొదలెట్టాడు:

"నా పర్వతాలు, నీలి తెలుపు కొండలు,
నా తాతలు తండ్రులు పుట్టిమెట్టిన గడ్డ!"

పాడుతూన్నవాడల్లా తటాలున తడబడ్డాడు. చిన్న దగ్గు దగ్గాడు. తరువాతి రెండు చరణాలూ, రవంత జీరబోయినప్పటికీ మంద్రస్థాయి నిండు కంఠంతో పాడాడు:

"నా పర్వతాలు, నీలి తెలుపు కొండలు
నా ఉయ్యాల...."

పాటలో ఈ మాట దగ్గర తను దేనినో చూసి జడుసుకున్నట్టుగా వాడు మళ్లీ ఆగిపోయి మౌనంగా వుండిపోయాడు.

వాడి కలవరపాటును నేను స్పష్టంగా ఊహించుకున్నాను. జంకుతూ బిడియపడుతూ పాటపాడడంలోనే అదేదో అసాధారణమైన ఉద్రిక్తత అవుపడింది. వాడిది శ్రావ్యమైన కంఠం: అది నిజంగా దనియార్‌దే అని యెవ్వరూ నమ్మరు.

"ఎంత బాగుందిరా!" అని అనకుండా వుండలేకపోయాను.

జమీల్యా కూడా ఆశ్చర్యపడింది:

"ఇంత మంచి గొంతుక పెట్టుకుని, ఇంతకు ముందల్లా పాడకుండా దాచుకున్నావా? ఊఁ, ఇహ ధారాళంగా పాడవోయ్!" అంది.

ఎదురుగా, కొండకనుమ నదీలోయలో అంతమవుతూన్నచోట, వెలుగ్గా

వుంది. లోయలోనుంచి పిల్లగాలి వీస్తూంది. దనియార్ మళ్లీ పాడడం ఆరంభించాడు. మళ్లీ జంకుతూనే బిడియపడుతూ ఆరంభించాడు. కాని క్రమక్రమంగా అతని కంఠం బలంపుంజుకుని లోయని నింపేసింది, దూరాన్నున్న శిలలను తాకి మార్మోగింది.

అన్నిటికంటె ముఖ్యంగా, ఆ స్వరమాధుర్యంలో యెంతటి భావతీవ్రత, యెంతటి ఉద్రేకం నిండివుండెనో కదా అని నేను ఆశ్చర్యపోయాను. దాన్ని యేమనాలో నాకు అప్పుడు తెలియలేదు, ఇప్పుడు కూడా తెలియడంలేదు. అది ఆ కంఠస్వరంలోనే వుండెనో, లేక అంతకంటె అత్యంత ముఖ్యమైనది — మనిషి ఆత్మలోనుండే సరాసరి పైకివచ్చేది, అటువంటి భావాన్నే మరొకరిలో కూడా ప్రేరేపించేది, మనను అట్టడుగున దాగివున్న ఆలోచనలకు ప్రాణం పోసేది — యేదైనా వుండెనో నేను ఇదమిద్ధమని చెప్పలేకుండా వున్నాను.

దనియార్ పాటని నేను ఏ విధంగానైనా సరే పునరుత్పత్తి చేయగలిగితేనా! ఆ పాటలో మాటలు యించుమించు లేనేలేవు, మాటలులేకుండానే ఆ పాట ప్రగాఢమైన మానవాత్మను బహిర్గతంచేసింది. అటువంటి పాటను అంతకుముందు కాని, అటు తరవాత కాని నేనెన్నడూ వినలేదు. అది కిర్గీజ్ స్వరమూ కాదు, కజాఖ్ స్వరమూ కాదు, దానిలో ఇదీ అదీ — రెండూ వున్నాయి. ఆ రెండు సోదరదేశాల స్వరాల్లోనూ ఉత్తమమైనవాటిని దనియార్ పాట తనలోకి తీసుకుని, ఇకమరెన్నడూ పునరావృతం కాజాలని గీతంగా తన సొంత రీతిని మేళవింపజేసింది. అది పర్వతాలూ స్తెప్‌మైదానాల పాట కిర్గీజ్ పర్వతాల్లా ఆకాశంలోకి ఈ క్షణం ఖంగుమంటూ ఎగిరిపోవడం, రెండో క్షణం నిశ్చితంగా స్వేచ్ఛగా కజాఖ్ స్తెప్‌మైదానంలా విస్తరించుతూండడం.

ఆ పాట విని నేను దిగ్భ్రాంతి చెందిపోయాను: "అసలు దనియార్

ఇలా వుంటాడన్నమాట! ఇలా అనుకుందుకే వీల్లేకపోయిందే యెవ్వరికీనీ!''
అనుకున్నాను.

ప్రైవ్‌మైదానంలో మెత్తని కచ్చారోడ్డంట వెళ్తున్నాయి మా బళ్లు. దనియార్ పాట ఒక్కమాటు మళ్లీ పైకిలేచింది, కొత్తకొత్త స్వరాలు అద్భుతలాలిత్యంతో ఒకదానిలోనుండి ఇంకొకదానిలోకి మారిపోయాయి. వీడికింత ప్రతిభ వుందా నిజంగా? వీడికేమొచ్చింది? ఈ దినంకోసమే, ఈ గడియకోసమే తను ఇన్నాళ్లూ కనిపెట్టుకున్నట్టు!

తన తోడివారిలో దిగ్భ్రమమూ యెగతాళినీ రేకెత్తించిన వీడి వింత ప్రకృతి – వీడి స్వప్నదర్శక స్వభావమూ ఏకాంతాభిలాషి, వీడి మితభాషణమూ ఇప్పుడు నాకు తటాలున అర్థమైంది. సాయంకాలమంతా ఆ దిబ్బ మీదనే యెందుకలా కూచునేవాడో, యేటివొడ్డునే వొక్కడూ రాత్రంతా యెందుకు గడిపేవాడో, ఇతరులకు వినబడని ధ్వనులను నిరంతరం యెందుకు వింటూండేవాడో, వీడి కళ్లు అప్పుడప్పుడు తటాలున మెరిసి, మామూలుగా నిక్కపొడుచుకునున్న కనుబొమలు యెందుకు అదిరేవో ఇప్పుడు నేను అర్థం చేసుకున్నాను. వీడు గాఢప్రేమలో చిక్కుకున్న వ్యక్తి. వీడు ప్రేమలో నిమగ్నమై వున్నాడు, అది మరో మనిషిపట్ల ప్రేమ కాదని నాకు అనిపించింది. ఆ ప్రేమ ఇంకేదో ఇంకొక విధమైన, అఖండమైన ప్రేమ – ఈ జీవితం పట్ల, ఈ భూప్రపంచం పట్ల ప్రేమ అనీ నాకు స్ఫురించింది. అవును, తన ప్రేమను తనలోనే, తన సంగీతంలోనే దాచేసుకున్నాడు, ఆ ప్రేమలోనే తను జీవిస్తున్నాడు. తన గాత్రం యెంత గొప్పదైనప్పటికీ ఉదాసీనుడైన వ్యక్తి యిలా గానంచేయలేడు.

గానంయొక్క కట్టకడపటి ప్రతిధ్వని అణగారిపోయిన తరవాత మరొక కొత్త కంపితస్వరం లేచి, కునుకుపాట్లు పడుతూన్న ప్రైవ్‌మైదానాన్ని

మేలుకొల్పుతూన్నట్టు అనిపించింది. నిద్రనుండి మేల్కొన్న స్త్రీవ్మైదానం ఆదరాభిమానాలతో నిండిన గాయకుని పాటను ప్రేమాస్పదమైనదిగా భావించి కృతజ్ఞతతో వింది. ముదిరి గచ్చకాయరంగున బడి కోతకోసం యెదురు చూస్తూన్న గోధుమపైరు విశాల నదీభాగజలంలా అల్లలాడింది – తెల్లవారు జాము తొలివెలుగు రేకలు పొలంపైన పరుగుతీస్తున్నాయి. పిండిమిల్లు దగ్గ రున్న పెద్దగుంపు ముదుసలి విల్లోచెట్లు వాటి ఆకులను రెపరెపలాడించాయి, యేటి ఆవలివొడ్డున పొలంపనివాళ్లు వేసుకున్న నెగళ్లు ఆరిపోయాయి. ఎవడో ఒక రౌతు నీడలా కానవచ్చి, యేటిగట్టుపైన పల్లె దిశనున్న పళ్లతోట మధ్య ఓ క్షణం మాయమైపోతూ, మరు క్షణం మళ్లీ అవుపడుతూ నిశ్శ బ్దంగా పరుగెత్తాడు. అక్కడనుంచి వస్తూన్న గాలి ఆపిల్ పండ్ల పరిమ ళాన్నీ, మొక్కజొన్న పూవుల గుమ్మపాల తావినీ, ఎండుతూన్న పేడపిడకల వెచ్చని వాసననూ మోసుకొచ్చింది.

దనియార్ మైమరచి యెంతో సేపు పాడాడు. ఆగస్టు రాత్రి మంత్ర ముగ్ధ అయి అతడి పాటను నిశ్శబ్దంగా వింది. ఈ మంత్రమహిమను తామెక్కడ భగ్నంచేసిపోతామో అని భయపడినట్టుగా గుర్రాలు కూడా తమ పరుగులను లయబద్ధమైన అంగలుగా మార్చివేశాయి.

స్వరం ఖంగుమంటూ ఉన్నతోన్నతమైన తారస్థాయిని అందుకునేసరి కల్లా ఆ స్వరాన్ని దనియార్ తటాలున తెంపేసి, ఖైంయ్‌మని కేకేసి, కమ్చీ చరిచి గుర్రాల్ని తోలాడు. జమీల్యా తన బండిని కూడా వాడి వెంబడే దౌడు తీయించడానికి తయారవుతుందనే నేను అనుకున్నాను, కాని ఆమె కద ల్లేదు మెదల్లేదు. నిలవకుండా యెగిరిపోతూ గాలిలో యెక్కడికో పారి పోతూన్న కట్టకడపటి స్వరాన్ని అలా వింటూన్నట్టుగా, బుజాల్లోకి తల కుంగదీసేనుకుని యెలా కూచునుందో అలాగే కూచునుండిపోయిందామె.

దనియార్ బండి తోలుకుని వెళ్లిపోయాడు. గ్రామంచేరుకునేవరకూ మేమిద్దరం పల్లెత్తుమాటైనా మాటాడుకోలేదు. అవును, మాట్లాడు కుందుకు అవసరం లేకపోయింది కూడా. మనసులో వున్నదంతా మాటలు యెల్లప్పుడూ చెప్పలేవు....

ఆనాటినుండి మా జీవితాల్లో యేదో మార్పు వచ్చేసినట్టనిపించింది. ఏదో మంచి కోసం, ఏదో వాంఛనీయమైనదానికోసం ఇహ నేను అస్తమానం కనిపెట్టుకునుండేవాణ్ణి. పొద్దున్నే కళ్లందగ్గర మా బళ్లల్లో బస్తాలు వేసుకుని స్టేషనుకి చేరుకునేవాళ్లం. తిరుగుదారిలో దనియార్ పాట వినేందుకని అక్కడనుంచి త్వరత్వరగా వచ్చేసే వరకు మాకు ఓపిక వుం డేదికాదు. దనియార్ కంఠస్వరం నాలో స్థిరనివాసం యేర్పరచుకుంది. ముందరికాళ్లకి బందంవేసి వదలిపెట్టిన గుర్రాల దగ్గరకు మంచుతో తడిసిన లూసెర్న్ రొట్టగుండా ఉదయాన నేను పరుగెత్తి వెళ్లేవాణ్ణి, మరప్పుడు నవ్వుతూన్న సూర్యుడు నన్ను పలకరించేందుకని పర్వతాల వెనక నుంచి దొర్లుకుంటూ రాగా, దనియార్ కంఠస్వరం నన్ను అడుగడుగునా తరుముకొచ్చేది. ముదుసలి ఎగురపోత మనుషులు పంట ధాన్యం తూర్పెత్తగా గాలికి రాలిన గోధుమ గింజల కనకవర్షపు మృదు మర్మరధ్వనిలో, స్తెప్ మైదానపు ఆకాశాన విహరించుతూన్న ఒంటరి గరుడపక్షి వలయాకృతి ఎగు రులో – నేను చూసిన సర్వంలోనూ, నేను విన్న సర్వంలోనూ దనియార్ పాట నా చెవులకు సోకినట్టు అనిపించింది.

సాయంకాలం కొండకనుమ వెంట బళ్లమీద వెళ్తూండేప్పుడు ప్రతిసారీ నా కనిపించేది – నన్ను మరొక లోకానికి తీసుకొనిపోతూన్నట్టు. అర్ధ నిమీలిత నేత్రాలతో వినేవాణ్ణి దనియార్ పాట – నాకు చిన్నప్పటినుంచీ సుపరిచితమై ఆశ్చర్యం కల్గించుతూన్న దృశ్యాలు నా కళ్లముందు నిలిచేవి:

'యూర్త'లకు ఎగువను, కొంగలు విహరించే ఆకాశాన ధూమ్రనీలపు వాసంతికా సంచారక మేఘాలు ఈ నిమిషాన ఎగిరిపోయాయి; ఉత్తర నిమిషాన డెక్కల చప్పుళ్లతోనూ సకిలింపులతోనూ గింగురుమంటూన్న భూమిమీదనుండి దౌడు తీస్తూన్న గుర్రపు మందలు వేసవి పచ్చికబయళ్ల దిశగా సాగిపోయాయి. నిడుపాటి ముందరి జూలూ, నల్లని ఆటవిక దృక్కులు సారించుతూన్న కళ్లూగల పిల్లగుర్రాలు గర్వంగా వెర్రిగా పరుగెత్తుతూ తమ తల్లులను దాటిపోయాయి; మరు నిమిషాన, గొర్రెల మందలు ప్రశాంతమైన లావా ప్రవాహంలా కొండలపైన వ్యాపించాయి; వేరొక నిమిషాన, మరుగుతూన్న తన చింపిరి తెలుపుదనం కళ్లు మిరుమిట్లు కొలుపుతూండగా జలపాతం గండశిలలనుండి శరవేగంతో దూసుకుపోయింది; తరువాతి నిమిషాన, యేటి ఆవల స్తెప్‌మైదానంమీద వున్న ముళ్లగడ్డి పొదల చిట్టడవి చాటున సూర్యుడు మృదుకాంతులు విరజిమ్ముతూ అస్తమిస్తున్నాడు, దిగ్మండలపు మందు టంచుననున్న ఒంటరి రౌతు ఆ సూర్యుణ్ణి వెంటతరుముతూన్నట్టు అవు పడ్డాడు — అతడు చేయి చాచి సూర్యుణ్ణి పట్టుకోవచ్చు — మరి, ఆ రౌతు కూడా చిట్టడవిలోకీ సందెచీకటిలోకీ అదృశ్యుడైపోయాడు.

నది ఆవల కజాఖ్ స్తెప్‌మైదానం అపారంగా విస్తరించివుంది. అది మా పర్వతాలను ఇరువైపులకూ కదలించివేసి కర్కశంగా ఒంటరిగా పడు కుంది....

కాని యుద్ధారంభ దినాల్లో, ఆ స్మరణీయమైన వేసవికాలంలో, స్తెప్‌మైదానంపైన హెచ్చరిక మంటలు లేచాయి. మిలిటరీ గుర్రాల మందలు స్తెప్‌మైదానాన్ని వేడిధూళితో మేఘావృతం చేసివేశాయి, గుర్రపు

రౌతులు నలుదిక్కులా పరుగెత్తారు. నది అవలి వొడ్డున తన గుర్రాన్ని దౌడు తీయించుతూన్న కజాఖ్ రౌతు వొకడు గొడ్లకాపరికి స్వాభావికమైన కంఠ స్వరంతో కేకెయ్యడం నాకు బాగా జ్ఞాపకంవుంది.

"కిర్గీజియన్లూ! గుర్రాలెక్కండి: శత్రువొచ్చాడు!" అని ఆ రౌతు కేకేసి ధూళిదుమారపు సుడిలోనూ వడగాలి పొగల కెరటాలలోనూ మాయ మైపోయాడు.

స్తెప్‌మైదానమంతా లేచింది, మా తొలి కేవ్రెలీ రెజిమెంట్లు, కఠోర గంభీర గర్జనలనడుమ, పర్వతాలలోనుండీ లోయలవెంటనూ తరలివెళ్ళాయి. వేలాది రికాబులు ఖణేలుఖణేలుమన్నాయి, వేలాది 'జిగిత్'లు స్తెప్‌మైదానంలో ప్రత్యక్షమయారు, ధ్వజస్తంభాల కొనలనున్న అరుణపతాకలు వారి యెదట రెపరెపలాడాయి, వారి వెనుక, గుర్రపు డెక్కలు లేపిన ధూళికి అవల, భార్యల గొంతుకలనుండీ తల్లుల గొంతుకలనుండీ వెడలుతూన్న శోకభరిత మహత్వపూర్ణమైన ఆక్రందన భూమిని దద్దరిల్లజేసింది: "స్తెప్‌మైదానం మీకు సహాయం చేయుగాక! మన మహాయోధుడు మానస్ ఆత్మ మీకు సహాయంచేయుగాక!"

ప్రజలు ఎక్కడెక్కడనుండి యుద్ధానికెళ్ళారో అక్కడల్లా కంటక పథాలు మిగిలాయి....

ఐహిక సౌందర్య మనస్తాపాల ప్రపంచాన్ని నేను చూడగలిగేటట్టు దనియార్ పాట నాకు కనువిప్పుకల్గించింది. దానిని వాడు యెక్కడ నేర్చు కున్నాడు? ఎవరి దగ్గర విన్నాడు? ఎన్ని యేళ్ళుగానో తన జన్మభూమికోసం మనసారా ఆవేదనపడి, దాని ప్రేమకోసం బాధలుపడిన మనిషే దానిని ఈ విధంగా ప్రేమించగల్గుతాడని నాకు అర్థమైంది. వాడు పాడుతూన్నప్పుడు, వాడు పసిపిల్లవాడుగా స్తెప్‌మైదానపు రోడ్లవెంట తిరుగుతూండడం నా

కళ్లముందు నిలిచింది. తను పుట్టిన గడ్డను గురించిన పాటలు బహుశా వాడు పుట్టినప్పుడే వాడి మనస్సులో పుట్టాయేమో? లేక, అగ్నిమయమైన యుద్ధమార్గాలపై వాడు అడుగిడినప్పుడు పుట్టాయేమో మరి?

దనియార్‌ని వింటూంటే భూమిని అంతగా ప్రేమించగల్గినందుకై దానికి కృతజ్ఞత తెల్పేందుకు కుమారునిలా దాన్ని గాఢంగా హృదయానికి హత్తుకుందామనే కోరిక నాలో పుట్టింది. అంతవరకు నేను ఇదమిద్ధమని పేరుపెట్టి చెప్పలేకపోయినట్టిది కొత్తదేదో నాలో మేల్కొన్నట్టు మొట్ట మొదటి సారిగా అప్పుడు నా కనిపించింది, కాని ఇది అదేమిటో అప్రతిహ తంగా వుండెను. ఇది తనంతట తను స్వయంవ్యక్తతకోసం — అవును, తన ప్రపంచాన్ని చూసి, స్పృశించి, తెలుసుకోవడమే కాకుండా, తన స్వప్నదృశ్యాలను, తన ఆలోచనలను, భావాలను ఇతరులు చూసి గ్రహించ గల్గేటట్లు చేయడమూ, మన ప్రపంచంయొక్క సౌందర్యం గురించి ఇత రులకు, దనియార్‌లాగానే ఉత్తేజకరంగా తెలియజేయడంకోసం — తీవ్ర కోరిక. పట్టరాని భయసంభ్రమాలతోనూ ఆనందంతోనూ యేదో నే నెరగనిదాని యెదట నిశ్చేష్టుడనైపోయాను. కాని చిత్రలేఖనే నా జీవితపరమావధి అనే సంగతిని అప్పటికింకా నేను గ్రహించలేదు.

బొమ్మలు వేయడమంటే నాకు చిన్నప్పట్నుండీ సరదా. నా పాఠ్య పుస్తకాల్లో వున్న చిత్రాలను చూసి వాటికి నకళ్లు చిత్రించేవాణ్ణి, నేను వేసినవాటిని మా కుర్రాళ్లు చూసి, "అచ్చంగా అచ్చుగుద్దినట్టే" వున్నాయనేవాళ్లు. స్కూలు గోడవార్తాపత్రికకి నేను వేసిన బొమ్మల్ని మా మేష్టార్లు కూడా మెచ్చుకునేవారు. కాని తరవాత యుద్ధం మొదలైంది, అన్నలు సైన్యంలో చేరారు, మరి నా యీడు పిల్లలందరిలాగానే నేనూ స్కూలు మానేసి సమష్ట వ్యవసాయ క్షేత్రంలో పనికెళ్లాను, రంగులూ

కుంచెలూ — వీటి సంగతే మరచిపోయాను. వాటి సంగతి మళ్ళీ యేనాడైనా జ్ఞాపకం తెచ్చుకుంటాననైనా అనుకోలేదు. కాని దనియార్ పాట నా మనసును మళ్ళీ మేల్కొలిపింది. కలలో తిరుగులాడుతూన్నట్టే నా కనిపించింది, ప్రపంచాన్ని ఇదే తొలిసారి చూసినట్టు దానిని దిగ్భ్రాంతితో చూశాను.

మరి జమీల్యా తటాలున యెంతలా మారిపోయింది! హుషారుగా, మాటకి ఏాటా అంటించుతూండిన ఆ నవ్వులబండి అంటూ వుండెనా అనిపించింది. ప్రశాంతమైన వసంతకాలపు విషాదం మబ్బుకమ్మిన ఆమె కళ్ళను ఆవరించింది. మేం స్టేషనుకి వెళ్తూండగా దారిలో ఆమె దేనిగురించోగాని యెడతెగకుండా అస్తమానమూ అలా ఆలోచించుతూవే వుంది. అస్పష్టమూ స్వప్నమయమైన చిరునవ్వు ఆమె పెదవులపై చలించింది, తన కొక్కర్తెకే తెలిసిన మంచి సంగతేదో తల్చుకుని ఆమె నెమ్మదిగా ఆనందించింది. బుజాలమీద బస్తా వేసుకుని, ఉరుకులతోనూ నురుగలతోనూ పారుతూన్న యేరు తన యెదట వున్నట్టుగానూ ఆ యేటిని దాటి తను వెళ్ళడమో వెళ్ళకపోవడమో తనకి తెలియనట్టుగానూ, తనకు అర్థంకాని పిరికితనానికి లొంగిపోయినట్టుగానూ, అక్కడ అలా నించుండిపోవడం అనేక సార్లు జరిగింది. ఆమె దనియార్‌ని తప్పించుకుని తిరిగేది, వాడికేసి కన్నెత్తి చూసేదికాదు.

ఓనాడు జమీల్యా వాణ్ణి కళ్ళందగ్గర చూసి బాధాజనితమై, నీరసించిన చికాకుతో అంది:

"నీ షర్టు విప్పి ఇలా ఇయ్యి. దాన్ని వుతుకుతాను!"

దాన్ని పుచ్చుకుని, యేటిలో వుతికి, అక్కడ నేలమీద ఆరేసి, దాని ముడుతలను జాగ్రత్తగా తన అరచేతితో సాపుచేసి, దాన్ని యెండకి యెదురుగా

పట్టుకుని, అరిగిపోయిన బుజాలదగ్గర పరీక్షగా చూసి, జాలితో తలకాయ వూపి, మళ్లీ మరొకసారి దాన్ని మృదువుగానూ విచారంగానూ సాపుచేస్తూ యెంతోసేపు అలా అక్కడ కూర్చుంది.

ఈ రోజుల్లో వొక్కసారి మాత్రమే జమీల్యా బిగ్గరగా, సాంక్రామికంగా నవ్వింది, ఆమె కళ్లు వెనకటిలానే మెరిసిపోయాయి. ఆనాడు లూసెర్న్‌రొట్ట పోగుచేసి కుప్పవేయడం పూర్తిచేసుకుని కొందరు కన్నెపడుచులూ స్త్రీలూ, యుద్ధంనుండి డిమోబిలైజైన 'జిగిత్'లూ వొక గుంపుగా చేరి పెద్ద రొదచేస్తూ కళ్లం దగ్గరకొచ్చారు.

"ఏయ్ ఖామందులూ, మీ రొక్కరేకాదు తెల్లబ్రెడ్డు తినడానికి, మేమూ వున్నాం, మాకూ కాస్త రుచిచూపించండి. లేకుంటే మిమ్మల్ని యేట్లో తోసేస్తాం!" అంటూ 'జిగిత్'లు హాస్యానికి తమ పంగటికర్రలను బారుచేసి పట్టుకున్నారు.

"మీ పంగటికర్రలు మమ్మల్నేమీ భయపెట్టవు! మా నేస్తురాళ్లకి యేదో ఫలహారం వెదికి యిస్తాను. మరి మీరుమాత్రం మీ తంటాలు మీరు పడాల్సిందే!" అని జమీల్యా ఖంగుమంటూన్న గొంతుకతో జవాబుచెప్పింది.

"ఐతే మరి మిమ్మల్నిందరినీ యేట్లో ముంచేశామన్నమాటే!" అన్నారు 'జిగిత్'లు.

ఇహ దాంతో అమ్మాయిలూ అబ్బాయిలూ వొకరితో వొకరు తలపడ్డారు. కేకలతో బొబ్బరింతలతో నవ్వులతో ఒకరినొకరు నీటిలోకి తోసుకున్నారు.

"వాళ్లని పట్టుకోండి, పట్టుకుని నీట్లోకి ఈడ్చేయండి!" అంటూ జమీల్యా అందరికంటే హెచ్చుగా నవ్వుతూ, తనమీదకి వస్తూన్నవాళ్లని చురుగ్గానూ నేర్పుతోనూ తప్పించుకుంటూ కేకేసింది.

కాని, అదేమిటో చిత్రం, అందరి 'జిగిత్'ల కళ్లూ వొక్క జమీల్యా

మీదనే వుండెను. ప్రతివాడూ సరిగ్గా వొక్క ఆమెను పట్టుకుందుకే ఆమెను వాటేసుకుందుకే ప్రయత్నించాడు. తటాలున ముగ్గురు అబ్బాయిలు ఆమెను పట్టుకుని యేటొడ్డుకు మోసుకుపోయారు.

"మమ్మల్ని ముద్దెట్టుకో, లేకుంటే – ఏట్లో తోసేస్తాం!"

"తోసేద్దాంరా!"

జమీల్యా యిటు పరుగెత్తబోయింది, అటు పరుగెత్తబోయింది. గట్టిగా నవ్వింది, తలకాయ వెనక్కి విదలించుకుని, ఆ నవ్వుల్లోనే తన నేస్తురాం డ్రవి సాయానికి రమ్మని కేకేసింది. కాని వాళ్ల యేట్లో పడిపోయిన తమ తలరుమాళ్లను నీట్లోనుంచి తీసి తెచ్చుకుంటూ హడావిడిగా వొడ్డంట పరుగెత్తారు. 'జిగిత్'ల ఉల్లాసభరితములైన కేరింతాల నడుమ జమీల్యా నీటిలోకి దూసుకుపోయింది. నీళ్లుకారుతూ విరియబారిన జుట్టుతో వెనకె న్నడూ లేనంత అందంగా ఆమె నీటిలోనుంచి పైకొచ్చింది. తడిసిన నూలు అద్దకం గౌను గుండ్రంగా దృఢంగా వున్న పిరుదులనూ బాల వక్షోజాలనూ బహిర్గతంచేస్తూ, ఆమె వొంటికి అంటుకుంది. ఆమెమాత్రం అదేమీ చూసుకోకుండా నవ్వింది, యిటూ అటూ విరగబడింది, యెర్రగా జేవురించిన ముఖంవెంట నీటిచుక్కలు ధారలుకట్టి ప్రవహించాయి.

"మమ్మల్ని ముద్దెట్టుకో!" అని 'జిగిత్'లు ఆమెను అల్లరిపెట్టారు.

జమీల్యా వాళ్లని ముద్దెట్టుకుంది, కాని మళ్లీ వెంటనే నీట్లోకి దూసుకుపోయింది, బరువుగా తడిగా వున్న జుట్టుపాయలను విదలించు కుంటూనూ.

యువకుల ఆటలూ వేళాకోళాలూ చూసి కళ్లందగ్గర వున్నవారందరూ నవ్వారు. ముసలి ఎగరబోతగాళ్లు తమ నిలువుపారలు అక్కడ పడేసి కళ్లవెంబడి కారుతూన్న కన్నీటిని తుడుచుకున్నారు. వారి కావిదేరిన ముఖాల

మీద వున్న ముడుతలు సంతోషంతో వెలుగొందాయి, యవ్వనపు కళతో క్షణమాత్రం తొణికిసలాడాయి. 'జిగిత్'లనుండి జమీల్యాను కాపాడడం నా పవిత్రవిధి అనే సంగతి ఆ నిమిషంలో మరచిపోయి, నేను కూడా మనసారా నవ్వాను.

అక్కడున్న వారందరిలోనూ నవ్వనివాడు దనియార్ ఒక్కడే. నేను అనుకోకుండా వాడివైపు చూశాను, చూసి మౌనంగా వుండిపోయాను. వాడు ఒంటరిగా కళ్లం అంచున కాళ్లు పంగచాపుకుని నించున్నాడు. నించున్న వాడల్లా అక్కడనుంచి చర్రున వొక్క పరుగున వెళ్లి జమీల్యాను 'జిగిత్'ల చేతుల్లోనుండి లాగేస్తాడనే నా కనిపించింది. వాడు ఆమెకి కళ్లప్పగించేసి, విచారంతోనూ మెప్పుకోలుతోనూ నిండి, సంతోషమూ బాధా వెడలుతూన్న చూపులతో ఆమెవంక చూస్తున్నాడు. అవును, జమీల్యా సౌందర్యంలోనే వుండెను వాడి ఆనందమూ, వాడి దుఃఖమూనూ. 'జిగిత్'లలో ప్రతి ఒక్కడూ తనను ఆమె బలవంతాన ముద్దెట్టుకునేటట్టు చేసి ఆమెను వాటే సుకున్నప్పుడు దనియార్ తలకాయ ముందుకు వాల్చేశాడు, అక్కడనుంచి వెళ్లిపోవడానికని కదిలాడు, కాని వెళ్లలేదు.

ఈలోపున జమీల్యా కూడా వాడివేపు చూసింది. ఆమె చప్పున నవ్వు ఆపుకొని తల దించేసింది.

"ఈ అల్లరిపెట్టడం ఇహ చాలు!" అని ఆమె తటాలున, మితిమీరి హంగామా చేస్తూన్న 'జిగిత్'లని కసిరింది.

వాళ్లలో వొకడు ఆమెను కౌగలించుకుందుకు ప్రయత్నించాడు.

"ఫో!" అని జమీల్యా వాణ్ణి వెనక్కి తోసేసి, తల పైకి విదలించి, దనియార్‌వంక చిన్న నేరపుచూపు చూసి, తన గౌను పిడుచుకుందుకని పొదల్లోకి పరుగెత్తి పారిపోయింది.

వాళ్లిద్దరి మధ్యనూ వున్న సంబంధం గురించి నాకింకా స్పష్టం కాలేదు, దీని గురించి ఆలోచించేందుకే భయపడ్డానని నేను ఒప్పుకుంటాను. కాని జమీల్యాయే దనియార్‌ని తప్పించుకు తిరుగుతూండడమూ, ఆ కారణంగా ఆమె విచారంగా వుండడమూ నేను గమనించినప్పుడు, మరెందుచేతనో గాని నా మనస్సు మనస్సులో లేకుండాపోయింది. వెనకటిలా తను నవ్వుతూ వాణ్ణి వేళాకోళాలు పట్టించుతూంటేనే యెంతో నయమనిపించింది నాకు. కాని అదేసమయంలో, రాత్రిపూట మేం గ్రామానికి తిరిగివస్తూ దనియార్ పాట వింటూన్నప్పుడు, మరెందుచేతో నేను చెప్పలేనుగాని, వాళ్లిద్దరూ సుఖంగా వుండాలనే కోరిక నాలో పుట్టుకొచ్చి నాకెంతో సంతోషం కల్గింది.

మేం కనుమలోనుంచి వెళ్తూన్నప్పుడు జమీల్యా తన బండెక్కిపోయి బండితోలేది. కాని స్తెప్‌మైదానం వచ్చేసరికి ఆమె బండి దిగిపోయి, బండి పక్కనే వడిచేది. నేనూ నా బండి పక్కనే నడిచేవాణ్ణి, రోడ్డుమీద నడుస్తూ పాట వినడమే నయమనిపించింది. మొదట్లో ఎవరి బండిపక్క వారే నడిచాం, కాని అలా ఒక్కొక్క అడుగు వేస్తూ మామట్టుకు మేము గమనించకుండానే దనియార్‌కి మరింత మరింత దగ్గరగా నడిచాం. అదేదో అదృశ్యశక్తి మమ్మల్ని వాడి దగ్గరకి లాక్కుపోయి, వాడి ముఖంలోనూ కళ్లల్లోనూ వున్న భావాన్ని ఆ చీకట్లో చూద్దామనే కోరిక మాలో పుట్టించింది. ధుమధుమలాడుతూ ఎవ్వడితోనూ కలివిడిగా వుండని దనియారే ఇలా పాడడం సాధ్యమా అని?

అలాంటప్పుడు ప్రతి పర్యాయమూ, జమీల్యా భయసంభ్రమాలతో పరవశురాలై చలించిపోవడమూ, వాడికేసి మెల్లగా చేయి చాపడమూ నేను చూశాను. కాని వాడు మాత్రం దీన్ని గమనించలేదు. తన పెడతలను అరచేతుల్లో ఆనించి ఇటూ అటూ ఊగిపోతూ యే ఉన్నత శిఖరాన్నో

యెంత దూరంలోకో చూస్తున్నాడు. జమీల్యా చేయి అప్రయత్నంగా బండి పక్కబల్ల అంచుపైన వాలింది. ఆమె తుళ్లిపడి చప్పున తన చేయి అక్కడ నుంచి తోసేసుకుని, నడుస్తూన్నదల్లా ఆగిపోయింది. ముఖం వేలేసుకుని దిగ్భ్రమచెందిపోయి అతడివెంట చూపులు సారిస్తూ రోడ్డుమధ్య యెంతో సేపు అలా నించుంది: తరవాత మళ్లీ నడక సాగించింది.

జమీల్యా నేనూ కూడా అదేదో బాధాకరమైనట్టీ, అంత సమానంగానూ అర్థంకానట్టీ అచ్చంగా ఒకేవొక ఆవేదన అనుభవించుతున్నామే అని ఒక్కొక్కప్పుడు నాకు అనిపించేది. ఈ ఆవేదన చాలాకాలంనుండే మా మనస్సుల్లో గుప్తంగా వుండి, అది వెలికి రావలసిన గడియలు బహుశ ఈనాడు తటస్థపడ్డాయేమో?

జమీల్యా పనిలో మునిగిపోయి మైమరిచిపోయేది, కాని మాకు అరుదుగా దొరికే విశ్రాంతిక్షణాల్లో మేమింకా కళ్లందగ్గరే కూచునుండినప్పుడు ఆమె యేమిటో అదో మోస్తరుగా వుంటూవచ్చింది. ఎగురబోతలవాళ్లదగ్గర తచ్చాడేది, నిలువుపార బలంగా యెత్తుగా పట్టుకుని కొన్ని నిలువుపారల గోధుమల్ని తూరుపారబట్టేది, తరువాత తటాలున ఆ నిలువుపార అక్కడ పారేసి గడ్డికుప్పలదగ్గరకి వెళ్లిపోయేది. వాటి నీడను కూచుని, వొంటరిగా కూచుందుకు తనకు భయంవేసినట్టుగా నన్ను పిలిచేది:

"ఇలారా, చిట్టీ! కాస్సేపిక్కడ కూచుందాం!"

అలా కూచున్నప్పుడు నాతో యేదో ముఖ్యమైన సంగతి చెబుతుందనీ, తనను ఆందోళనపరచుతూన్న విషయం గురించి వివరించుతుందనీ నేనెప్పుడూ కనిపెట్టుకుని వుండేవాణ్ణి. కాని ఆమె యేమీ మాట్లాడింది కాదు. మౌనంగానే ఆమె నా తలను తన వొళ్లోపెట్టుకుని, యెక్కడికో దూరంగా చూస్తూ ముళ్లల్లా వున్న నా తలవెంట్రుకలు నిమిరింది, వణకిపోతూ

వేడిగా వున్న వేళ్లతో నా ముఖాన్ని మృదువుగా తడిమింది. నేను కన్నెత్తి ఆమె ముఖంవంక, అస్పష్టమైన ఆందోళనతోనూ ఆపేక్షతోనూ నిండిన ఆమె ముఖంవంక, చూసేసరికి, అందులో నా ముఖాన్ని పోల్చుకున్నట్టే అనిపించింది నాకు. ఆమెను యేదో బాధపెట్టుతూంది. మనసులో యేదో పేరుకుపోయి ముదిరి పండిపోయి, ఇహ బయటికి వచ్చేస్తా నంటూంది. ఇది ఆమెకు భయంకల్గించింది. ఆమె కూడా తను దనియార్‌ని ప్రేమించు తూన్నట్టు తనలో తను చిత్రహింస అనుభవించుతూ ఒప్పుకుందుకు ఇష్ట పడింది, అదేసమయంలో ఒప్పుకుందుకు కూడా చిత్రహింస అనుభవించు తూనే ఇష్టపడడంలేదు – సరిగ్గా నాలాగే, ఆమె దనియార్‌ని ప్రేమించడం నా కెలాగైతే ఇష్టమైందో, మళ్లీ యెలాగైతే నాకిష్టంలేకపోయిందో అచ్చంగా అలాగే. ఇంతకీ ఆమె మా యింటికోడలూ మా అన్నగారి భార్యా కదా!

కాని ఆ ఆలోచనలు నాలో కేవలం క్షణమాత్రమే తలెత్తాయి. వెంటనే వాటిని నా మనస్సునుండి పారదోలాను. ఆ రోజుల్లో నాకు నిజమైన ఆనందం – చిన్నపిల్లల పెదవుల్లా సగం తెరచుకుని వున్నట్టి కోమలములైన ఆమె పెదవులను చూడడమూ, కన్నీటితో మకమకలాడుతూన్న ఆమె కనుదోయిని చూడడమే. ఆమె యెంత మనోహరంగా, యెంత అందంగా వుండెను! ఆమె ముఖంలో యెంతటి ప్రకాశమానమైన ఉద్దీపనా భావాతిరేకమూ తొణుకుతూండెను! అప్పట్లో నేనిదంతా చూశానేగాని, అంతా అర్థంచేసుకో లేకపోయాను. ఇప్పుడైనా నన్ను నేను తరుచుగా ప్రశ్నించుకుంటాను: కళాకారుడూ, కవీ అనుభవించే ఉద్దీపనవంటి ఉద్దీపనే కాబోలు ప్రేమ? జమీల్యాని చూస్తూంటే నాకు స్తెప్మైదానంలోకి పరుగెత్తాలనీ, నాలో వున్న ఈ అర్థంకాని ఆందోళననీ, ఈ అర్థంకాని ఆనందాన్నీ అధిగమించడానికి

నేను యేమిటి చేయడమా అని మొరపెడుతూ భూమినీ ఆకాశాన్నీ గొంతెత్తి అడగాలనీ అనిపించింది. దీనికి జవాబు దొరికినట్లు ఒకనాడు నాకు తోచింది.

మామూలు ప్రకారం మేం స్టేషన్నుండి బళ్ళు తోలుకుపోతున్నాం. జాము రాత్రి అయింది. ఆకాశాన నక్షత్రాలు గుంపులు గుంపులుగా ముసురుకున్నాయి. స్టెప్మైదానం నిద్రపోడానికి నడుంవాల్చింది, దనియార్ పాట మాత్రమే నిశ్శబ్దానికి భంగం కల్గించుతూ రవళించి, మృదువై అంధకారబంధురమ్మైన సుదూరాన సమసిపోయింది. జమీల్యా నేనూ వాడి బండివెంట నడిచాం.

కాని ఈసారి దనియార్ కేమొచ్చిందో మరి? వాడి పాటలో మృదుత్వమూ, గుండెలవిసిపోయే విషాదమూ ఒంటరితనమూ యెంత ప్రగాఢంగా వుండెనంటే, వాడిపట్ల సానుభూతీ కనికరమూవల్ల పొరలివచ్చిన కన్నీళ్ళ మా గొంతుకల్లో అడ్డుపడ్డాయి.

శిరస్సు వొక పక్కకు వాల్చేసి, బండి పక్కబల్ల అంచు గట్టిగా పట్టుకుని నడిచింది జమీల్యా. దనియార్ కంఠం మళ్ళీ తారస్థాయిని అందుకోవడం మొదలెట్టేసరికల్లా జమీల్యా శిరస్సు విదలించుకుని, బండిలోకి ఉరికి, అతడి పక్కను కూచుంది. గుండెలపైన చేతులు కట్టుకుని శిలా విగ్రహంలా నిశ్చేష్టురాలై కూచుంది. నేను కొద్దిగా ముందుకు పరుగెత్తి వాళ్ళపక్కనే నడిచి, వాళ్ళని ఓ పక్కనుండి చూశాను. తన పక్కను జమీల్యా వుందన్న సంగతి తను గమనించనట్టే వాడు తన పాట సాగించాడు. ఆమె చేతులు నీరసంగా కిందకి వాలిపోయుండడమూ, ఆమె దనియార్ని అంటిపెట్టుకుని తన శిరస్సును వాడి భుజంపైన మెల్లగా ఆనించివుండడమూ చూశాను. కొరడా దెబ్బకి ఛటుక్కున తటపటాయించిన జాతిగుర్రంలా,

వాడి గొంతుక క్షణమాత్రం వణకింది – వణకి, నూతన శక్తితో మళ్లీ రవళించింది. వాడు ప్రేమగీతాన్ని పాడుతున్నాడు!

నేను విభ్రాంతి చెందిపోయాను. స్తెప్మైదానం పువ్వులు పూసినట్టూ, ఒక్కసారి కదలిపోయి చీకటిని విడదీసేసినట్టూ అయింది. ఇహ అప్పుడు చూశాను, విశాల స్తెప్మైదానంలో ఇద్దరు ప్రేమికుల్ని. వాళ్లు నన్ను గమనించనే లేదు – నేనక్కడ లేనట్టే అనిపించింది వాళ్లకి. నేను వాళ్ల పక్కనే నడుస్తూ చూశాను – ప్రపంచంలో వున్న సర్వాన్నీ మరచిపోయి, ఆ పాట లయ ప్రకారం ఇద్దరూ జోగిపోతున్నారు. వాళ్లని నేను చూశాను, కాని వాళ్లని పోల్చుకోలేకపోయాను. పాడుతూన్నవాడు చీకి చివికిపోయి గుండీలు విడిపోయిన ఆర్మీషర్టు తొడుక్కొనున్న యెప్పటి దనియారే, కాని ఆ చీకట్లో వాడి కళ్లు నిప్పుల్లా మండినట్టయింది. కనురెప్ప వెంట్రుకలపై మిలమిల్లాడుతూన్న కన్నీటి చుక్కలతో, అంత నెమ్మదిగానూ అంత బిడియపడుతూనూ వాణ్ణి అంటిపెట్టుకున్న జమీల్యా, నా జమీల్యాయే. వీళ్లు అపూర్వానందంలో ఓలలాడుతూన్న కొత్త వ్యక్తులు. ఇది ఆనందం కాకుండా వుంటుందా? తన జన్మభూమిపై తనకున్నట్టి – ఉద్దీపితమైన ఈ సంగీతాన్ని తనలో ప్రభవింపజేసినట్టి అఖండప్రేమను సర్వాన్నీ దనియార్ ఆమెకు సంపూర్ణంగా అర్పించేశాడు, ఆమెకోసమే వాడు గానం చేశాడు, ఆమెగురించే వాడు గానంచేశాడు!

దనియార్ పాటల్లోనుంచి యెల్లప్పుడూ వెడలే బుద్ధికందని ఉద్రేకం మళ్లీ మరొకసారి నన్ను ఆవహించింది. నా కోరిక యేమిటో యిప్పుడు నాకు స్పష్టంగా తెలిసింది. వాళ్లని చిత్రించుదామనే కోరిక పుట్టింది నాలో.

నా ఆలోచన పట్ల నాకే హడలేసిపోయింది. కాని హడలుకంటె

అభిలాషే హెచ్చు బలంగా వుండెను. వాళ్లని అచ్చంగా ఇలా వున్నట్టే — చిత్రిస్తాను — ఆనందంలో మునిగివున్నట్టే! అవును, అచ్చంగా ఇప్పుడిలా వున్నట్టే చిత్రిస్తాను. కాని నేను చిత్రించగలనా? హడలుతోనూ సంతోషంతోనూ నాకు ఊపిరాడలేదు. తీయని కైపుతో మైమరచి నడిచాను. ఈ అహంకారపూరితమైన కోరిక భవిష్యత్తులో నా కెంతటి కష్టాల్ని తీసుకురానున్నదో నాకింకా తెలియకపోవడంచేత నేనూ యెంతో ఆనంద భరితుడనయాను. ప్రపంచాన్ని దనియార్ యే దృష్టితో చూస్తున్నాడో ఆ దృష్టితోనే నేనూ చూడాల్సివుంటుందనీ, దనియార్ పాటని నేను రంగుల్లో వివరించుతాననీ, నా చిత్రంలో కూడా పర్వతాలూ, స్తెప్‌మైదానమూ, మనుషులూ, గడ్డిచెట్లూ, మేఘాలూ, నదులూ వుంటాయనీ నాతో నేను చెప్పకున్నాను. తటాలున: "నాకెక్కడనుంచి వస్తాయి రంగులు? స్కూలువాళ్లు నా కివ్వరు, ఉన్నవేవో వాళ్లకేకావాలి!" అనుకున్నాను. అసలు చిక్కంతా యిందులోనే వున్నట్టు!

దనియార్ పాట అదాటుగా ఆగిపోయింది. వాణ్ణి జమీల్యా ఉద్రేకంతో కాగలించుకుంది, కాని వెంటనే వెనక్కి తగ్గి, క్షణమాత్రం మ్రాన్పడింది, తరవాత పక్కకి తిరిగిపోయి, ఇహ బండిలోనుంచి గెంతేసింది. దనియార్‌కి యేమిచెయ్యడానికీ తోచక కళ్లేన్ని బిగించి పట్టుకున్నాడు. గుర్రాలు ఆగిపోయాయి. వాడివంక వీపు తిప్పేసి జమీల్యా రోడ్డుమీద నించుంది. తరవాత తల విసురుగా వెనక్కి విదలించి, వాడివైపు సగంతిరిగి వాడికేసి చూసి, కన్నీళ్లు అపుకోలేక,

"ఏమిటలా చూస్తున్నావ్?" అంది ఒక్క నిమిషం వూరుకుని, "నా వేపు చూడకు, నీ బండి తోలుకెళ్లిపో!" అంది కఠినంగా. ఇహ నా వేపు తిరిగి, "ఎందుకలా నోరెళ్లబెట్టుకుని చూస్తున్నావ్?" అని నన్ను కసిరింది.

"బండెక్కు, బండెక్కి కళ్లెం పట్టుకో! మిమ్మల్ని చూస్తే నా కసహ్యం వేస్తోంది!"

"ఇంతట్లోకే యేమిటొచ్చింది ఈమెకి?" అని నేను దిగ్భ్రాంతి చెంది పోయి, గుర్రాల్ని తొందరపెట్టాను. ఇంతకీ ఆమె కేమొచ్చిందో ఊహించు కోవడం యేమంత కష్టం కానేకాదు: ఆమె మహా అవస్థపడిపోయింది, తను శాస్త్రసమ్మతంగా పెళ్లాడిన పెనిమిటి బతికేవున్నాడు, సరాతొవ్ పట్నంలో యే మిలిటరీ ఆస్పత్రిలోనో గాయాలనుండి కోలుకుంటువున్నాడాయె. అయిన ప్పటికీ ఈ విషయం గురించి యేమని నిశ్చయించేందుకూ నా కేమాత్రమూ మనస్కరించలేదు. ఆమెమీద నాకు కోపంవచ్చేసింది, నా మీద కూడా నాకు కోపం వచ్చేసింది. అంతేకాదు, మీదటికిహ దనియార్ పాట పాడడం మానేస్తాడనీ, అతడి గొంతుకను వినే అవకాశం నా కిహ ఎన్నటికీ వుండదనీ అప్పుడు నాకు తెలిసివుండినట్టయితే బహుశ జమీల్యాని ద్వేషించి వుండే వాణ్ణేమో కూడా.

యమయాతనలాంటి బడలిక వొంటిని ముక్కచెక్కలు చేసేసింది. ఎంత వేగంగా కళ్లం చేరుకుందునా, ఎంత వేగంగా గడ్డిలో నడుంవాల్చుదునా అనిపించిపోయింది నాకు. దౌడుతీస్తూన్న గుర్రాల వీపులు చీకట్లో మీదకీ కిందకీ ఆడుతున్నాయి, బండి భరించశక్యంకాకుండా కుదిపేసింది, కళ్లేలు పదేపదే చేతిలోనుంచి జారిపోయాయి.

కళ్లం చేరుకుని నేను యెలాగో ఓలాగ గుర్రాల్ని విప్పేసి, బండి సామాన్లు తీసేసి, వాటిని బండికింద పారేసి గడ్డి దగ్గరకి చేరుకుని, గడ్డిమీద వెళ్లి పడ్డాను. ఈసారి దనియార్ ఒక్కడే గుర్రాల్ని పచ్చికబయలుకి తోలుకెళ్లాడు.

కాని పొద్దున్న నాకు మెలకువ వచ్చేప్పటికి నా మనస్సు సంతోషంతో

పొంగిపోయింది. దనియార్ జమీల్యాలను నేను తప్పకుండా చిత్రిస్తాను! కళ్లు గట్టిగా మూసేసుకుని, వాళ్లిద్దరినీ ఎలా చిత్రిస్తానో అన్ని వివరాల తోనూ అతి కచ్చితంగా ఊహించుకున్నాను. ఇహ కుంచే, రంగులూ పట్టుకుని చిత్రం వేసేయడమే తరువాయి.

ఏటికి గబగబా వెళ్లి కడుక్కుని, ముందుకాళ్లకి బంధం వేసివున్న గుర్రాలదగ్గరకి పరుగెత్తాను. చెమ్మగా చల్లగా వున్న లూసెర్న్ రొట్ట కొరడాల్లా చురుకుచురుకుమని పుత్తకాళ్లకు తగిలింది, చిటపటమంటూ కాళ్లకింద పగిలింది, పాదాల మునివేళ్లలో గుచ్చుకుంది, అయినా నాకు మంచి సరదాగా వుండెను. నేను పరుగెత్తాను, పరుగెత్తుతూనే చుట్టు పక్కల యేం జరుగుతూందో గమనించాను. సూర్యుడు కొండ చాటునుండి తలెత్తుతూండగా పంటకాలువ వొడ్డున యాదృచ్ఛికంగా మొలచిన సూర్య కాంతచెట్టు సూర్యుడివంక తలెత్తుతూంది. తెలుపు తలల ఆవమొక్కలు దాన్ని ఆబతో చుట్టుకున్నాయి, కాని అది లొంగలేదు: ఉదయభానుని కిరణాలను పట్టుకుంది, అవి ఆవమొక్కలకు చేరకుండానే వాటిని తన పసుప్పచ్చని నాల్కలతో లాక్కుని, వాటిని తన బుట్టలో వొత్తుగా కిక్కిరిసి వున్న విత్తనాలకి తాగమని యిచ్చింది. అదిగో, ఇక్కడ కాలువదాటే చోట బళ్లచక్రాలకింద నలిగిన చాళ్లవెంట నీరు సన్నని ధారగా పారుతూంది. అల్లక్కడ ఆ ఊదారంగు లంకలో నడుంయెత్తున లేచి పరిమళం వెదచల్లు తూన్న పాదీనా మొక్కలు. నేను పుట్టిన గడ్డమీద పరుగెత్తాను, పైన ఆకాశాన వానకోయిలలు రైంయ్ రైంయ్మని పరుగెత్తాయి. అయ్యో! ఈ ఉదయభానుణ్ణీ, ఈ తెలుపు నీలవు పర్వతాల్నీ, మంచుపొర కప్పిన లూసెర్న్ రొట్టనీ, పంటకాలువ వొడ్డున అడవిగా మొలుస్తూన్న ఈ సూర్యకాంత చెట్టునీ చిత్రించడానికి ఇప్పుడు నా దగ్గర రంగులు వుంటేనా!

కళ్లం దగ్గరకి తిరిగివెళ్లేసరికి సంతోషంతో వెలిగిపోతూన్న నా మనస్సు వెంటనే మేఘావృతమైపోయింది. జమీల్యాని అక్కడ చూశాను — ముఖం దిగాలుగా వాడిపోయింది. కళ్లకింద నల్లని పొట్టలు — ఆమె రాత్రి నిద్రపోయినట్టు లేదు, నన్ను చూసి చిరునవ్వు నవ్వనూ లేదు, నన్ను పలకరించనూ లేదు. కాని దళనాయకుడు ఒరొజ్మాత్ అక్కడ ప్రత్యక్షమయే సరికి, జమీల్యా అతడిదగ్గరకెళ్లి, అతణ్ణి పలకరించకుండానే అంది:

"మీ బండిని మీరు తీసుకోండి. మీ చిత్తంవచ్చిన చోటకి నన్ను పంపండి, ఇహ నేను మాత్రం స్టేషనుకి బండి తోలుకెళ్లేదిలేదు!"

"తల్లీ, ఇదేమిటిది? ఏమొచ్చింది నీకు? జోరీగ గాని కుట్టిందా యేమిటి?" అన్నాడు ఒరొజ్మాత్ ఆశ్చర్యంతో, ఆమెను సముదాయించుతూనూ.

"జోరీగలు దూడల్ని కుడతాయి! నన్ను మాత్రం ప్రశ్నలు వేసి చంపకండి! వెళ్లడానికి నా కిష్టంలేదన్నాను, ఇహ దాంతో సరి!"

ఒరొజ్మాత్ ముఖంనుండి చిరునవ్వు మాయమైపోయింది.

"నీ కిష్టం వుండనీ వుండకపోనీ, నువ్వు మాత్రం స్టేషనుకి గింజ తోలుకెళ్లాల్సిందే!" అంటూ అతడు తన చంకకర్రతో నేలను గట్టిగా తట్టాడు. "నిన్నెవరేనా యేమేనా అనివుంటే చెప్పు. ఈ చంకకర్ర వాడి మెడమీద విరుగుతుంది! అంతే కాని, ఈ పిచ్చివేషాలు మాత్రం కట్టిపెట్టు. నువ్వు తోలుకెళ్తూన్న గింజలు సైనికుల బ్రెడ్డుకోసం. నీ పెనిమిటీ అక్కడే వున్నాడాయె!" అన్నాడు. అలా అనేసి అతడు గిరున తిరిగి, చంకకర్రతో కుంటుకుంటూ వెళ్లిపోయాడు.

జమీల్యా చిడిముడిపడింది, ముఖమంతా యెర్రబడిపోయింది. తన పక్కనున్న దనియార్‌వేపు చూసి మెల్లగా నిట్టూర్చింది. దనియార్ అక్కడే కాస్తదూరాన ఆమెకు పెడముఖంగా నించుని, గుర్రాల కాలరుపట్టీలను

చివుక్కు చివుక్కున బిగిస్తున్నాడు. ఆ సంభాషణంతా విన్నాడు. జమీల్యా తన చేతిలో వున్న కమ్చీని తడుముతూ మరికాస్సేపు అక్కడ కూచుని, తరవాత నిర్లక్ష్యంగా చేయి జాడించి తన బండిదగ్గరకి వెళ్లిపోయింది.

ఆ రోజున మేం మామూలుకంటె ముందుగానే స్టేషన్నుంచి తిరిగివచ్చేశాం. తిరుగుప్రయాణం అంతసేపూ దనియార్ తన గుర్రంచేత నాలుగు కాళ్లా యెగరేయించి మరీ తోలాడు. జమీల్యా ముఖం ముడుచుకుని మౌనంగా వుంది. ఎండకి మాడిపోయి కారునలుపెక్కిన స్తెప్‌మైదానం నా ముందు వుండడం చూసి నా కళ్లను నేనే నమ్మలేకపోయాను. స్తెప్‌మైదానం నిన్న యిలా లేనేలేదు, ఎంతమాత్రమూ లేదు ఇలా. దీనిగురించి గంధర్వ గాథలో చెప్పినట్టే వుంది అచ్చంగానూ. నా చైతన్యాన్నే మార్చివేసిన ఆనంద చిత్రం నా మనస్సును విడిచిపెట్టి వెళ్లనేలేదు. జీవితం అంతటిలోనూ దేదీప్యమానమైన ఖండికను నేను పట్టుకున్నట్టు నా కనిపించింది. దీన్ని అన్ని వివరాలతోనూ నా మనోనేత్రం యెదట సృష్టించుకున్నాను, కేవలం దీనితోనే నేను పరవశుణ్ణయిపోయాను. కాటామనిషి దగ్గరనుండి ఒక దళసరి తెల్లకాగితం కాజేసిన తరవాత కాని నా మనసు స్తిమితపడలేదు. గుండె బద్దలైపోతుందేమో అన్నట్టు గొంతుకలో కొట్టాడుతూండగా నేను పరుగున వెళ్లి గడ్డికుప్ప చాటున దాగున్నాను. దాగుని, దారిలో ఎగురబోత మనుషులనుండి నేను కాజేసితెచ్చిన ఒక నున్నని చెక్కపారను తెచ్చి, దానిని బోర్లించి దానిపైన కాగితాన్ని పెట్టుకున్నాను.

"అల్లా కటాక్షించుగాక!" అని, వెనకెప్పుడో నాన్న తొలిసారి గుర్రంమీద కూచోబెట్టినప్పుడు నన్ను ఆశీర్వదించినట్టే, ఇప్పుడు నేనూ అనుకుని పెన్సిలుతో కాగితం తట్టాను. ఏ శిక్షణా లేకుండా నా అంతట నేను గీసిన తొలి గీతలు అవి. కాని దనియార్ రూపం కాగితంపైన అవుపడేసరికల్లా

ఇహ నేను ప్రపంచాన్ని మరచిపోయాను. ఆ కాగితంపైన ఆ ఆగస్టు రాత్రి స్తెప్‌మైదానం విస్తరించినట్టు నా కప్పుడే అనిపించింది, దనియార్ పాడుతూన్న పాట నేను వింటూన్నట్టే, దిసగొంతుతో తలకాయ వెనక్కి వాల్చేసిన అతగాణ్ణి నేను చూస్తూన్నట్టే అతని బుజంపైన వాలివున్న జమీల్యాని నేను చూస్తూన్నట్టే నా కనిపించింది. నేను మొదట స్వతంత్రంగా వేసిన చిత్రం అది: అదిగో బండి, అదిగో వాళ్లిద్దరూ, అదిగో బండి మెత్తాలపైన పడేసివున్న కళ్లేలు, చీకట్లో కిందకీ మీదకీ వూగుతూన్న గుర్రాల వీపులు, దూరాన స్తెప్‌మైదానం, అంతకంటె యెంతో దూరాన్నున్న నక్షత్రాలు.

చిత్రం వేస్తూ యెంతగా పరవశుణ్ణయిపోయానంటే, ఇహ చుట్టు పక్కల యేం జరుగుతూందో నేను గమనించనే లేదు. నా మీద వంగున్న వ్యక్తి గొంతుక వినబడి తుళ్లిపడ్డాను:

"ఏం నీకు చెవుడా యేమిటి?"

అది జమీల్యా గొంతుక. నేను తబ్బిబ్బుపడ్డాను, నా ముఖం జేవురించింది, ఆ చిత్రాన్ని చప్పున దాచేయలేకపోయాను.

"బస్తాలు బళ్లకెత్తి యెంతసేపో అయింది, గంటసేపైపై నీ కోసం అరిచి అరిచి వేసరిక వచ్చింది! ఏమిటి చేస్తున్నావిక్కడ?... ఏమిటిది?" అని ఆమె అడిగి, ఆ చిత్రాన్ని అందుకుంది. "హూఁ!" అని కోపంగా బుజాలెగరేసింది.

భూమి బద్దలై నన్ను మింగేసివుంటే బాగుండిపోనవిపించింది. జమీల్యా యెంతోసేపు ఆ చిత్రాన్ని చూసింది. ఇహ తరవాత మొగం పైకెత్తి చెమ్మగిలి విచారంతో విండిన కళ్లతో నా వంక చూసి,

"దీన్ని నా కిచ్చేయ్, చిట్టిమరిదీ! జ్ఞాపకంకింద దీన్ని దాచుకుం

టాను'' అంది. అలా అంటూ ఆ కాగితాన్ని రెండు మడతలు పెట్టి తన బ్లౌజులో దోపేసుకుంది.

బళ్లను తోలుకుని మేం అప్పుడే రోడ్డుమీదున్నాం. అయినా నా మనస్సును యేమాత్రమూ కూడదీసుకోలేకపోయాను. అదంతా ఓ కలలో జరిగినట్లు జరిగింది. నేను చూసిన దృశ్యాన్ని యేమాత్రం పోలివున్న చిత్రాన్నయినా సరే చిత్రించగల్గాననే సంగతి నేను నమ్మలేకపోయాను. మనస్సులో యెక్కడో అట్టడుగున అమాయకమైన విజయానందం. అప్పటి కప్పుడే గర్వం కూడా, తలెత్తింది. ఇహ ఒకదానిని మించి ఒకటి సాహసో పేతమైనట్టే, ఒకదానిని మించి ఒకటి సమ్మోహితం చేస్తున్నట్టే కలలతో నా తల తిరిగిపోయింది. రకరకాల చిత్రాలు – పెన్సిలుతో గీసిన బొమ్మలే కాకుండా, రంగులతో వేసిన చిత్రాలు – యెన్నిటినో వేద్దామనే కోర్కె నాలో అప్పుడే పుట్టింది. మేం మంచి జోరుమీద వెళ్లుతున్నామన్న సంగతే నేను పట్టించుకోలేదు. దనియారే తన గుర్రాల్ని అతి వేగంగా పరుగెత్తిస్తున్నాడు, జమీల్యా కూడా వెనకపడలేదు. ఆమె ఇటూ అటూ చూసింది, అప్పుడప్పుడు మరెందుకో గాని మనసు కరిగేటట్టూ తనేదో నేరంచేసినట్టూ చిరునవ్వు నవ్వింది. మరి నేనూ చిరునవ్వు నవ్వాను, ఏమంటే దనియార్ మీదనూ నా మీదనూ అంతకుముందు ఆమెకుండిన కోపం యిప్పుడు పోయిందనీ, ఇహ ఆమె అడిగితే వాడీ రోజు పాడతాడనీ నాకు అర్థమైంది....

ఈ రోజున మేం మామూలుకంటె బాగా ముందుగానే స్టేషను చేరుకున్నాం, అందుకు తగ్గట్టూ మా గుర్రాలు నురుగులు కక్కుతున్నాయి కూడామా. బళ్లు ఆగినవెంటనే దనియార్ బస్తాలు దించడం మొదలెట్టాడు. అతడికెందు కింత తొందర పుట్టిందో, మరి అతడి కేమొచ్చిందో అర్థం చేసుకోవడం కష్టం. మా పక్కనుండి రైళ్లు వెళ్లినప్పుడు అతడు నించుండి

పోయి, వాటివంక సాలోచనగా దృక్కులు సారిస్తూ చాలాసేపు అలా చూస్తూండే వాడు. జమీల్యా కూడా, వాడి మనస్సులో యేముందో తెలుసుకుందుకు ప్రయత్నిస్తూన్నట్టు, వాడేవంక చూసేవాడో తనూ ఆ వంకే చూసేది.

"ఇలా రావోయ్, గుర్రం లాడం ఒనులై ఆడిపోతూంది. దాన్ని వూడదీసేద్దూ!" అంటూ దనియార్‌ని పిలిచింది.

దనియార్ వచ్చి, గుర్రం డెక్కని తన మోకాళ్ల నడుమ నొక్కిపట్టుకుని లాడాన్ని వూడదీసేసి, తను మళ్లీ నిటాగ్గా నించున్న తర్వాత, జమీల్యా సరాసరి వాడి ముఖంకేసి చూసి, మెల్లగా అంది:

"నువ్వు అర్థంచేసుకోవేమి?... లేకుంటే, ఈ ప్రపంచంలో నీకు కావలసినదాన్ని నేనొక్కర్తెనేనా?..."

దనియార్ మౌనంగా వుండిపోయి నేలచూపులు చూశాడు.

"నాకు భరించడం సులభమనుకుంటున్నావా?" అంటూ జమీల్యా నిట్టూర్చింది.

దనియార్ కనుబొమలు అదిరాయి, ప్రేమతోనూ దుఃఖంతోనూ నిండిన చూపులతో ఆమెవంక చూసి, యేమిటో అన్నాడు. కాని అతడు యెంత మెల్లగా అన్నాడంటే, అతడి మాటలు నాకు వినబడలేదు. అతడు ఆ మాటలు అనేసి, మరెందుకో గాని తను తృప్తిపడి, గబగబా అంగలేసు కుంటూ తన బండిదగ్గరికి వెళ్లిపోయాడు. వెళ్తూన్నంతసేపూ గుర్రపు లాడాన్ని నిమురుతూనే వున్నాడు. నేను అతడివేపు చూసి, "జమీల్యా మాటలు అతణ్ణి యెందుకు ఉత్తేజపరిచాయో కదా?" అనుకున్నాను. ఒక వ్యక్తి భారంగా నిట్టూర్చుతూ: "నాకు భరించడం సులభమనుకుంటు న్నావా?" అని అంటే, ఆ మాటల్లో ఉత్తేజానికి యేముందంటా?

బస్తాలు దించడం పూర్తిచేశాం. ఇహ బళ్లు తోలుకెళ్లిపోడానికి సిద్ధ

మవుతూండగా, నలిగిపోయున్న ఆర్మీ ఓవర్‌కోటు తొడుక్కుని బుజంమీద సంచి మోస్తూన్న గాయపడ్డ సైనికుడొకడు స్టేషను ముంగిట అవుపడ్డాడు. కొద్ది నిమిషాల క్రితమే రైలు ఒకటి స్టేషనులో ఆగింది. ఆ సైనికుడు నాలుగు చెరగులా పరకాయించి,

"కుర్కురేవ్ గ్రామస్థులెవరేనా వున్నారా యిక్కడ?" అని కేకేశాడు.

"ఆఁ, నేను కుర్కురేవ్‌వాణ్ణే!" అని నేను జవాబుగా కేకేశాను, ఆ మనిషి యెవడై వుంటాడా అని ఆలోచించుతూ.

"ఎవరి అబ్బాయివి నువ్వు?" అని సైనికుడు నన్నడిగి, నాదగ్గరకొస్తూ, జమీల్యాని చూసి, ఆశ్చర్యంతోనూ సంతోషంతోనూ చిరునవ్వు నవ్వాడు.

"కరీమ్? ఏమిటి నువ్వేనా?" అని జమీల్యా కేకపెట్టింది.

"అరె! జమీల్యా చెల్లాయే!" అంటూ సైనికుడు తన రెండు చేతుల తోనూ ఆమె అరచేతిని పట్టుకుని నొక్కాడు.

అతడు జమీల్యా వూరివాడన్నమాట.

"నిజంగా అదృష్టమే! ఇటుకేసి తిరిగాను గాని, నువ్వు అవుపడతావని యెవరనుకున్నారు!" అని అతడు ఉద్రేకపడుతూ అన్నాడు. "నేను సాదిక్ దగ్గరనుంచే వస్తున్నాను, వాడూ నేనూ కలిసేవున్నాం ఆస్పత్రిలో. దేవుడు రక్షించి, ఈ నెల్లోనే — కాకపోతే వచ్చే నెల్లో అనుకో — వాడు వచ్చేస్తాడు. వాడిదగ్గరనుంచి వచ్చేస్తూ, వాడితో అన్నాను: "నీ పెళ్ళాంపేర వుత్తరం రాయరా, నే తీసికెళ్ళి యిస్తాను" అని. ఇదిగో వుత్తరం, తీసుకో! ఎక్కడా నలిగిపోకుండా అతిజాగ్రత్తగా పట్టుకొచ్చాను" అంటూ కరీమ్ ముక్కోణపు వుత్తరాన్ని జమీల్యాకి అందించాడు.

జమీల్యా వుత్తరం లాక్కుంది. ఆమె మొగం జేవురించింది, తరవాత వెల్లబారింది. ఆమె దనియార్‌వంక జాగ్రత్తగా ఓరకంటితో చూసింది.

అతడు వొంటరిగా బండిదగ్గర - ఆనాడు కళ్లం దగ్గర, కాళ్ళు వెడల్పుగా పంగజాపి నించున్నట్టు - నించుని, నిస్పృహతో జమీల్యావంక చూశాడు.

నాలుగు పక్కలనుండీ అక్కడకి పరుగెత్తుకొచ్చారు జనం. వాళ్లలో ఆ సైనికుణ్ణి యెరిగినవాళ్ళూ, అతడి వూరివాళ్ళూ అతణ్ణి పోలికపట్టి, వెంటనే అతడిమీద ప్రశ్నలవర్షం కురిపించారు. వుత్తరం తెచ్చినందుకు అతడికి జమీల్యా ధన్యవాదం చెప్పగల్గేలోపున, దనియార్ బండి ఖణఖణ చప్పుడు చేస్తూ వాళ్లపక్కనుండే వెళ్లి, ముంగిటనుండి దూసుకుపోయి, గోతులమీదనుండి చెంగుచెంగున గెంతుతూ దుమ్ము రేగ్గొట్టుతూ రోడ్డు వెంట వెళ్లిపోయింది.

"వాడికిగాని వెర్రెత్తలేదుకద!" అంటూ జనం కేకేశారు, వెళ్లి పోతూన్న వాడివెంట.

ఆ సైనికుణ్ణి జనం యెక్కడికో తీసుకెళ్లారు. జమీల్యా నేనూ అంతకంతకు దూరమైపోతూన్న ధూళిమేఘాలకేసి చూస్తూ స్టేషను ముంగిట నించుండిపోయాం.

"మనం వెళ్లిపోదాం వదినా!" అన్నాన్నేను.

"నన్ను ఒంటరిగా ఉండనీయ్, నువ్వెళ్లు!" అంది జమీల్యా దుఃఖంతో.

ఈవిధంగా, ఇన్నాళ్లల్లోనూ తొలిసారిగా ముగ్గురం యెవరిమానాన వాళ్లం ఒంటరిగా బళ్లు తోలుకుని వెళ్లిపోయాం. ఉక్కిరిబిక్కిరి చేసేస్తున్న ఉక్కకి అర్చుకుపోయిన పెదవులు మంటపెట్టేశాయి. పగటి ఎండకి నెర్రెలువారి, కాలికాలి దగ్ధమై తెల్లబడిన నేల యిప్పుడు చల్లబడి, దానిపైన పేలిన ఉప్పు నెరసిన వెంద్రుకలు లేచినట్టు అవుపడింది. నిరాకారుడై అస్తమించుతూన్న సూర్యుడు ఈ ఉప్పని తెల్లని ఎండమావిపైనే కిందకి

దిగుతూ మీదకిలేస్తూ ఉయ్యాలూగుతున్నాడు. అక్కడ, మసకమసగ్గా కనబడుతూన్న దిగ్మండలంపైన నారింజపండు రంగు తుపాను మబ్బులు పోగయాయి. రివ్వురివ్వున వీస్తూన్న గాలి గుర్రాల మూతులకు తగిలి, వాటిని తెల్లని యెండు తెట్టుతో కప్పేసి, వాటి బరువు జూలుని వెనక్కి తోసేసి, కొండగుట్టలమీద పెరుగుతూన్న వర్మ్‌వుడ్ పూగుత్తులను అల్లల్లాడించుతూ వెళ్లిపోయింది.

"వర్షం పడుతుందా యేమిటి చెప్మా?" అనుకున్నాను.

ఎంతో దిక్కుమాలినవాణ్ణయిపోయినట్టు నా కనిపించింది! ఎంతటి ఆందోళనో నన్ను పట్టుకు వేధించేసింది! తమ పరుగును నడకలోకి మార్చి వేయడానికే అంతసేపట్నుంచీ ప్రయత్నిస్తూన్న గుర్రాల్ని కొరడాతో వొక్క చరుపు చరిచాను. సన్నని నిడివికాళ్ల బట్టమేకపక్షులు యెక్కడికో కొండ కనుమలోకి ఆందోళనతో యెగిరిపోయాయి. వాడిపోయిన యెడారి బర్డక్ ఆకులు గాలిలో రోడ్డువెంట కొట్టుకుపోతున్నాయి – అలాంటి మొక్కలు మా ప్రాంతాల్లో లేవు, ఆ ఆకులు యెక్కడనుంచో యే కజాఖ్ వైపునుండో గాలికి కొట్టుకొచ్చి వుండాలి. సూర్యుడు అస్తమించాడు. చుట్టుపక్కల వొక్క ప్రాణి అయినా లేదు. సాయంకాలానికల్లా డస్సిపోయిన స్టెప్‌మైదానం వొక్కటే వుందక్కడ.

కళ్లందగ్గరకి చేరుకునేసరికి అప్పుడే చీకటడిపోయింది. అంతా నిశ్శబ్దంగా వుంది, గాలి అన్నమాట లేదు. దనియార్‌ని కేకేశాను.

"ఏటికెళ్లాడు" అని కాపలామనిషి చెప్పాడు, "గుమాయింపుగా వుండడాన్ని అందరూ ఇళ్లకెళ్లిపోయారు. గాలి బిడాయించేసింది, ఇహ కళ్లంలో పనేమీ వుండదుగా!"

గుర్రాల్ని పచ్చికబయలుకి తోలుకెళ్లాను. నేను కూడా ఏటికెళ్లడానికే

నిశ్చయించుకున్నాను – దనియార్‌కి కొండచరియ పక్కను ఇష్టమైన జాగా యేదో నాకు తెలుసును.

దనియార్ అక్కడ కూచునున్నాడు – గూనిగా వంగి, మోకాళ్ల ముణుకులపైన తల అన్ని, చరియ దిగువున పారుతూన్న యేటిహోరు వింటున్నాడు. వాడి దగ్గరకెళ్లి, వాణ్ణి కాగలించుకుని వాడితో యేదైనా మంచిమాట చెబుదామని అనిపించింది నాకు. కాని వాడితో నే నేమిట్టి చెప్పగలను? వాడికి ఒకపక్కగా నించున్నాను, నించుని మళ్లీ వెనక్కితిరిగి వచ్చేశాను. వచ్చేసి, యెండుగడ్డిపైన యెంతో సేపు అలా పడుకుని, మబ్బులతో చీకటిపడుతూన్న ఆకాశంవైపు చూస్తూ, "ఈ జీవితం ఇంత క్లిష్టంగానూ అర్థంకాకుండానూ ఎందుకుందో?" అని తలపోశాను.

జమీల్యా ఇంకా స్టేషన్నుంచి తిరిగిరాలేదు. ఎక్కడికి మాయమైపోయిందో యేమిటో? నేను చిత్తుగా అలసిపోయినా నాకు కన్ను మూతపడలేదు. దూరాన కొండలపైన, మేఘరాసులలో ఎండకారు మెరుపులు మెరిశాయి.

దనియార్ కళ్లందగ్గరకి వచ్చేసరికి నేను మేలుకునే వున్నాను. అతడు అప్పుడప్పుడు మాత్రం రోడ్డుమీద ఓ కన్ను వేసివుంచుతూ, అలా మతిపోయినవాడిలా కళ్లం అంతా చుట్టబెట్టాడు. ఇక తర్వాత నా పక్కను గడ్డికుప్పమీద కూలబడ్డాడు. "వీడు తప్పకుండా యెక్కడికో వెళ్లిపోతాడు. ఈ గ్రామంలో ఇహ వీడుండడు! కాని యెక్కడి కెళ్తాడో మరి? ఒంటరిగాడు, యిల్లూ వాకిలీ లేనివాడు. వీడు యెవణ్ణి ఉద్ధరించాలి గనుక!" అనుకున్నాను. నాకు చిన్న కునుకు పట్టింది. ఆ కునుకులోనుండే నాకు వినబడింది – ఖణఖణమంటూ నింపాదిగా వస్తూన్న బండి చప్పుడు. జమీల్యా కళ్లానికి తిరిగివచ్చేస్తూన్నట్టుంది....

నే నెంతసేపు నిద్రపోయానో నాకు గుర్తులేదు. కాని తటాలున,

గడ్డిపైన పడిన యెవరి అడుగులో నా చెవిదగ్గర మర్మరధ్వని చేశాయి. నేను కళ్లు తెరిచాను. అక్కడున్నది జమీల్యా. ఆమె యేటినుంచి వచ్చింది, గౌను తడిసి చల్లగా వుంది. ఆమె నించుండిపోయి, గాభరాగా యిటూ అటూ చూసి, దనియార్ పక్కను కూచుంది.

"దనియార్, నే నొచ్చాను, నా అంతట నేనే వచ్చాను," అంది మెల్లగా.

చుట్టుపక్కలంతా నిశ్శబ్దం. మెరుపు వొకటి చప్పుడుచేయకుండా ఆకాశంనుండి కిందకి పాకింది.

"నీకు కోపంగా వుందా? చెడ్డ కోపంగా వుందా?"

మళ్లీ నిశ్శబ్దం, వొడ్డునుండి కోరుకుపోయిన మట్టిగడ్డ ఒకటి మాత్రం మృదువైన ధ్వనితో నీటిని చరిచి నదిలోకి జారిపోయింది.

"తప్పు నాదీ కాదు, నీదీ కాదు...."

దూరపు కొండల్లో ఉరుము ఉరిమింది. మెరుపు జమీల్యా ముఖానికి వెలుగిచ్చింది. ఆమె దనియార్‌వంక చూసి, వాణ్ణి పెనవేసుకుంది. దనియార్ చేతుల్లో గజగజ వణకిపోతూన్న ఆమె బుజాలు కిందకీ మీదకీ రొజుకున్నాయి. ఆమె గడ్డిపైన సాగిలబడి వాడి పక్కనే పడుకుంది.

వేడిగాడ్పు స్తెప్‌మైదానంపైన పరుగెత్తి, గడ్డిని సుడితిప్పుతూ పైకి లేచింది, కళ్లం అంచున ఊగిపోతూన్న 'యూర్త'పైన బలమైన దెబ్బకొట్టి, బొంగరంలా గిరగిర తిరుగుతూ రోడ్డుపైన నానా హడావుడీ చేసింది. నీలిరంగు మెరుపులు మళ్లీ మరొకసారి తళుక్కులొత్తుతూ మేఘాల్లోకి దూసుకుపోయాయి. ఉరుము ఫెళఫెళమంటూన్న పొడి చప్పుడుతో పైన విరిగింది. భయంకరంగానూ, మళ్లీ సరదాగానూ వుండెను — మెరుపు జల్లు తరలివచ్చింది, వేసవికాలపు చిట్టచివరి మెరుపుజల్లు.

"నీ కంటె వాణ్ణే మిన్నగా యెంచుకున్నానని అనుకున్నావేమో?" అంది గుసగుసగా ఆమె, తీవ్రమైన ఉద్రేకంతో. "అలా యెన్నడూ అనుకోకు, ఎన్నడూ! వాడు నన్ను యేనాడూ ప్రేమించలేదు. నన్ను అడిగేవని రాసే వాడు – అదేనా వుత్తరం చిట్టచివరన. నాకు వాడూ అక్కర్లేదు, ఆలస్యంగా వచ్చిన వాడి ప్రేమా అక్కర్లేదు. లోకులు యేమంటే అననీ! నిన్ను ప్రేమించాను, ఒంటరిగాడివి నిన్నే, నిన్ను నే నెవ్వరికీ ఇవ్వను! ఎప్పట్నుంచో నిన్ను ప్రేమించాను. నిన్ను తెలియకముందునుంచే నిన్ను ప్రేమించి నీ కోసం కనిపెట్టుకున్నాను. నీ కోసం కనిపెట్టుకున్నానని నీకు తెలిసే నువ్విక్కడికొచ్చావు!"

నీలం మెరుపులు ఒకదాని వెంట ఒకటి విరిగి, కొండచరియ దిగువనున్న యేట్లోకి ఒడుచుకుపోయాయి. జిల్లుమంటూన్న వాన చినుకులు గడ్డిలో జలజలమన్నాయి.

"జమీల్యా, ప్రేయసీ, ప్రియతమా!" అంటూ దనియార్ కజాఖ్, కిర్గిజ్ భాషల్లో వున్న అన్ని ప్రేమవచనాలతోనూ ఆమెను సంబోధించుతూ ఆమె చెవిలో గుసగుసమన్నాడు. "నేనూ నిన్ను యెంతకాలంగానో ప్రేమిస్తున్నాను. కందకాల్లో వున్నప్పుడే నీ గురించి కలలుగన్నాను, నేను పుట్టిన గడ్డపైనే నా ప్రేయసి వుందన్న సంగతి నే నెరుగుదును, అది మరెవ్వరూ కాదు, జమీల్యా, అది నువ్వే!"

"ఇటు తిరుగు, నీ కళ్లల్లోకి చూడనియ్ నన్ను!"

తుపాను విరుచుకుపడింది.

గాయపడిన పక్షి రెక్కలు కొట్టుకుంటూన్నట్టు, గాలికి చిరిగిపోయిన 'యుర్త' తోలుకప్పు టపటప కొట్టుకుంటూంది. గాలిచేతిలో కిందనుండే కొరడా దెబ్బలు తిన్న వాన కుండపోతగా కిందపడి, తుపాను జోరుతో ప్రవహించి,

నేలను ముద్దు పెట్టుకున్నట్టుంది. శక్తివంతమైన హిమావతరణంవంటి ఉరుము యావత్తు ఆకాశం గుండా కోసుగా దొర్లింది. తళుక్కులొత్తుతున్న వేసవి కాలపు మెరుపుల కాంతిపుంజాలు పర్వతాలను వసంతకాలపు ట్యూలిప్ పుష్పాలతో జ్వలింపజేశాయి. కొండకనుమలలో గాలి భయానకంగా మోత పెట్టింది, హడలెత్తించేటట్టు గర్జించింది.

వర్షం ధారాపాతంగా పడుతూంది, నేను గడ్డిలోకి దూరిపోయి పడు కున్నాను, చేతికింద గుండె గబగబ కొట్టుకుంటూందని గ్రహించాను. నా మనసు ఆనందంతో నిండిపోయింది. మనిషి దీర్ఘకాలం జబ్బుపడిన తర్వాత తొలిసారి సూర్యుణ్ణి చూసినప్పుడు ఎటువంటి సంవేదన అనుభవించుతాడో అటువంటి సంవేదనే నేనూ అనుభవించాను. వానా, మెరుపువెలుగూ గడ్డికింద వున్న నా దగ్గరకొచ్చాయి, అయినా నాకు ఎంతో హాయనిపించింది, మరి ఆ గుసగుస దనియార్ జమీల్యాల గుసగుసో, లేక వెలిసిపోతూన్న వాన చినుకులకి గడ్డిపరకల రెపరెపో నాకు తెలియనే లేదు, అయినా చిరునవ్వు నవ్వి నిద్రపోయాను.

ఇక వర్షాకాలం దగ్గరపడుతూంది, కొద్ది రోజుల్లో శరత్తు వస్తుంది. వర్మ్‌వుడ్, చెమ్మగిలిన గడ్డి వెదచల్లే శారదార్ద్రతవంటి తేమ వాసనలు అప్పుడే గాలిలో తేలాడుతున్నాయి. శరత్కాలంలో మా కేమిటి ఎదురుపడబోతుందో? మరెందుకో కాని, దీనిగురించి నేను ఆలోచించవేలేదు.

రెండేళ్లపాటు చదువు మానేసిన తరవాత ఈ శరత్తులో మళ్లీ స్కూలుకెళ్లడం మొదలెట్టాను. పాఠాలు అయిపోయిన తరవాత నేను తరుచుగా యేటివొడ్డుకెళ్లి, ఇప్పుడు యే అలికిడీ లేకుండా నిర్మానుష్యంగావున్న కళ్లందగ్గర నిట్టపు గట్టుమీద కూచునేవాణ్ణి. ఇక్కడ కూచునే వేశాను –

మోటుగా వున్న నా తొలితొలి రంగుల స్కెచ్చిలు. అనాటి నా బుద్ధికే అవి యేమాత్రమూ తృప్తికల్గించలేదు.

"ఇవి వొట్టి నాసి రంగులు! నా దగ్గర అసలైన రంగులుంటేనా!" అని నాలో నేననుకున్నాను, అవి యెలా వుండాలో నే నసలేమాత్రం ఊహించుకో లేకపోయినప్పటికీనీ.

సీసపు ట్యూబుల్లో నింపిన అసలైన నూనెరంగులను గురించి తెలుసుకునే అవకాశం బాగా కొంతకాలం గడచిన తర్వాత మాత్రమే నాకు కల్గింది.

రంగులు మంచివైతే బాగుండును కాని మేష్టార్లు చెప్పినదే నిజ మైనట్టు తేలింది: చిత్రకళ అధ్యయనం చేయవలసిన విషయం. కాని ఈ అధ్యయనం పగటికలగానే వుండిపోయింది. అన్నల దగ్గరనుండి యెటువంటి కబురూ లేనప్పుడు మా అమ్మ నన్ను — తనకు మిగిలిన ఒక్క కొడుకుని, "రెండు కుటుంబాలనూ పోషించాల్సిన 'జిగిత్' "ని — తన దగ్గరనుంచి వెళ్లనిచ్చే అవకాశం యెక్కడుంది గనక! అసలు దీని గురించి ఆమె యెదట యెత్తడానికే నాకు ధైర్యంలేకపోయింది. నా మీద పగ సాధించడానికన్నట్టు శరత్తు యెంత వొయ్యారంగా సింగారించుకుని బయటికి వచ్చిందంటే ఇహ దాన్ని చిత్రించకపోతే మరెందుకనిపించింది.

మంచులా జిల్లుమంటూన్న కుర్కురేవ్‌లో నీరు తీసిపోయింది. మెర కల్లో బయటపడిన బండలపైన కారుపసరు, నారింజపండు రంగుల పాకుడు వొత్తుగా పెరిగింది. నగ్నంగా కోమలంగా వున్న రోజ్‌విల్లోచెట్లు తొలి శీతలానికి యెర్రబడ్డాయి, కాని లేత పోప్లార్లు వాటి దృఢమైన పసుప్పచ్చని ఆకులను యింకా వదలకుండా భద్రపరచుకునే వున్నాయి.

గుర్రపుమందల కాపర్లు పొగచూరి వర్షానికి తడిసిన 'యుర్త్'లు కోతల తదుపరి ముంపువేలల్లో మొలచిన కపిలవర్ణపు గడ్డిలో నల్లని

మచ్చల్లా కానవచ్చాయి, 'యూర్త'ల పైకప్పులకున్న పొగకన్నాల ఎగువ వగరు వాసన వేస్తూన్న లేతనీలిరంగు పొగచాళ్లు తేలాడుతున్నాయి. శరత్తులో లాగున, సన్నంగా దృఢంగా వున్న మగగుర్రాలు గొంతుకలు చించుకుని సకిలి స్తున్నాయి, గోడిగలు నాలుగు దిక్కులా చెదిరిపోతున్నాయి, వాటిని వసంత కాలం వరకు మందల్లో వుంచడం ఇప్పటికే కష్టమైపోతూంది. కొండల్లో నుంచి తిరిగి వచ్చేస్తూన్న పశువులు మందలపాళంగా దుబ్బుల్లో తిరుగుతు న్నాయి. కపిల వర్ణానబడుతూ యెండిపోతూన్న స్తెప్‌మైదానంపైన బాటలు అడ్డుగానూ కోసుగానూ చెక్కినట్టున్నాయి.

కొద్ది రోజులకల్లా స్తెప్‌మైదానపు గాలి పెచ్చురేగడం మొద లెట్టింది, ఆకాశం బురదరంగు తేరింది, మంచు రాకను తెలియజెప్పే చోబు దార్లైన చల్లని వానలు ఇక కురవడం మొదలెట్టాయి. ఎలాగోగాని ఒకనాడు వాన తెరపివ్వగా, యిసుకమేటపైన మంట మండుతూన్నట్టున్న కొండ ఏష్ చెట్టును చూసి నేను యెంతగానో ముచ్చటపడి యేటొడ్డుకెళ్లాను. పాటి రేవుకి చేరువగా వున్న రోజ్‌విల్లోచెట్ల మధ్య కూచున్నాను. సాయంకాలమైంది. నాకు తటాలున ఇద్దరు మనుషులవుపడ్డారు. చూడగా, వాళ్ళు పాటి రేవు దగ్గర యేట్లోదిగి యేరు దాటినట్టున్నారు. వాళ్లు దనియారూ జమీల్యానూ. చింతాక్రాంతంగా కృతనిశ్చయంతో వున్న వారి ముఖాలకు నా కళ్ళు ఒప్పగించి అలా చూస్తూ వుండిపోయాను. బుజాలమీద సంచులు మోసుకుని దనియార్ కాలు యెత్తెత్తివేస్తూ నడుస్తున్నాడు, గుండీలు పెట్టుకోని ఆర్మీ ఓవర్‌కోటు అంచులు మడమలు అరిగిపోయిన అతని టార్పాలిన్ బూట్ల మోకాళ్లకి తపతప కొట్టుకుంటున్నాయి. జమీల్యా తెల్లని చిన్నశాలువ తలపైన చుట్టుకుంది, ఇప్పుడా శాలువ పెడతల వరకూ వెనక్కి జారిపోయింది. తనకున్న గౌన్లలో మంచి గౌను — మార్కెట్టు

కళ్లేప్పుడు యెంతో మోజుతోనూ డాబుసరిగానూ వేసుకునే పువ్వుల అద్దకం గౌను — తొడుక్కుంది, దానిపైన నూలు మొకమల్ కోటు వేసుకుంది. ఒక చేత్తో చిన్న మూట పట్టుకుంది, రెండో చేత్తో దనియార్ సంచికున్న స్ట్రాపును పట్టుకుంది. వాళ్లు నడుస్తూ యేమిటో మాట్లాడుకుంటున్నారు.

కొండకనుమకి అడ్డంగా వున్న బాటవెంట, ముళ్ల ఆకుల గడ్డిపొదలగుండా నడిచారు. వాళ్లు అలా వెళ్తూంటే, నా చూపు వాళ్లవెంటే సారించానే గాని, యేమిటి చేయడమో మాత్రం నాకు తెలిసిందికాదు. వాళ్లని పిలవాలేమో? కాని నా నాలుక అచ్చంగా అంగుటికి అంటుకుపోయింది.

చిట్టచివరి కెంపువన్నె కిరణాలు కొండలమీద వున్న మచ్చమచ్చల మబ్బులవెనక జారిపోయాయి, ఇక వెంటనే చీకటిపడడం మొదలైంది. దనియారూ జమీల్యా వెనక్కి తిరిగి చూడకుండా రైల్వేసైడింగువైపు నడిచారు. ముళ్లపొదల నడుమ వాళ్ల శిరస్సులు ఒకటిరెండు సార్లు తళుకుతళుకుమని మెరిశాయి, ఇక తరవాత మరి అవుపడలేదు.

"జమీ — ల్యా - ల్యా!" అని నా శక్తి అంతటితోనూ కేకేశాను.

"ల్యా – ల్యా – ల్యా!" అంటూ ప్రతిధ్వని దేశదిమ్మరిలా నలుదిశలూ తిరుగుతూ మారుమోగింది.

"జమీ - ల్యా - ల్యా!" అని నేను మళ్లీ మరోసారి కేకేసి, వాళ్లెరగకుండా ఇహ సరాసరి నీట్లోకి గెంతేసి, యేరు దాటుతూ వాళ్లవెంట పరుగెత్తాను.

జిల్లుమంటూన్న నీటిబొట్ల మబ్బులు నా మొగాన కొట్టాయి, బట్టలు తడిముద్దలైపోయాయి, అయినా దారీ తెన్నూ చూసుకోకుండా ముందుకి పరుగెత్తాను. తటాలున యేదో కాళ్లలోపడి దభీమని నేలమీద తిరగ

బడ్డాను. తడిసిపోయున్నవాణ్ణల్లా తలెత్తలేకుండా అలా పడివుండి పోయాను. కన్నీరు ముఖంమీదనుంచి ధారలుకట్టి కారింది. అంధకారం నా బుజాలని కుంగదీసేసింది. ముళ్లాకుచెట్ల మెత్తని కాడలు కీచుగా విషాదంతో ఈల వేశాయి.

"జమీల్యా! జమీల్యా!" అని కేకేస్తూ నేను వెక్కివెక్కి యేడ్చాను, కన్నీళ్లు గొంతుకలోకెళ్లి నన్ను ఉక్కిరిబిక్కిరి చేసేశాయి.

మనుషులందరిలోనూ నా కత్యంత ప్రేమాస్పదులూ సన్నిహితులైన వారికి నేను దూరమైపోతున్నాను. అలా నేలమీద పడున్న నాకు తటాలున అర్థమైంది — జమీల్యాని నేను ప్రేమించానని. అవును, అది నా తొలి వలపు, పసితనపు వలపు.

తడిసిన మోచేతిలో ముఖం పెట్టుకుని చాలాసేపు అలా పడుకునుండి పోయాను. జమీల్యా దనియార్లకే కాదు నేను దూరమైపోయినది, నా పసితనానికే నేను దూరమైపోయాను.

కాళ్లీడ్చుకుంటూ చీకట్లో నేను యింటికి చేరుకునేసరికి, ముంగిటంతా హడావుడిగా ఉద్రిక్తంగా వుంది, రికాబులు ఖణేలుఖణేలున చప్పుడు చేశాయి, గుర్రాలకి యెవరో జీన్లు వేస్తున్నారు, తాగి మైకంలో వున్న ఒస్మాన్ గుర్రం యెక్కి గొంతుక చించుకుని అరుస్తున్నాడు:

"మన గ్రామంలోనుంచి ఎన్నడో మనం తగిలేసి వుండాల్సింది ఆ సంకరజాతి కుక్కవెధవని! మన కుటుంబానికి యెంత అవమానం, యెంత అప్రతిష్ఠ! వాడు నా కంటబడ్డాడంటే వాణ్ణి అక్కడికక్కడే చంపేస్తాను, నన్ను కోర్టుకి ఈడ్చుకుపోతే ఈడ్చుకుపోనియ్యండి — దారంటపోయే ప్రతి దేశదిమ్మరి వెధవా మన ఆడాళ్లని యెత్తుకుపోతూంటే నేను వూరుకు

నేదిలేదు! రండ్రా, గుర్రాలెక్కండ్రా, 'జిగిత్'లూ. వాడెక్కడికీ పారి పోకుండా వాణ్ణి స్టేషనుదగ్గర పట్టుకుందాం."

నా గుండె ఝల్లుమంది: వీళ్ళు యే రోడ్డంట వెళ్తారో? కాని వాళ్లని పట్టుకుందుకని వీళ్లు స్టేషనుకి పెద్ద రోడ్డంటే వెళ్లారనీ, అంతేగాని సైడింగుకు వెళ్లే రోడ్డంట వీళ్లు వెళ్లలేదనీ నా కెప్పుడైతే నమ్మకం తోచిపోయిందో ఇహప్పుడు నేను మెల్లగా ఇంట్లోకి జారుకుని, నా కన్నీరు యితరులకి కనబడకుండా వుండేందుకని పక్కమీదకెళ్లిపోయి, నాన్న గొర్రె బొచ్చు పెద్దకోటు కిందకి దూరిపోయి, దాన్ని తలమీదకి లాగేసుకుని మూడంకె వేసుకుని పడుకున్నాను.

గ్రామంలో యెంత చెప్పుకున్నారో, యెన్ని అవాకులూ చవాకులూ పేలారో మరి. ఇహ జమీల్యాని ఆడిపోసుకోవడంలో ఆడంగులు ఒకరినొకరు మించిపోయారు:

"హార్తి బుద్ధిలేనిది. అటువంటి అత్తింటినుంచి లేచిపోయి, తన కాపురంలో తనే నిప్పులు పోసుకుంది."

"ఇంతకీ వాడిలో యేం చూసి వాడితో లేచిపోయిందంటా? వాడికి యేముందనీ – ఆ చిరిగిపోయిన ఆర్మీ కోటూ, అరిగిపోయిన బూట్లే కదూ – వాడికుంటా?"

"గాలిగొడ్డులా తిరుగుతున్నాడు, వాడికి గొడ్డూ గోదమూ లేదు. నా అన్నవాళ్లు లేరు. వాడి ఆస్తి అంతా వాడి వొంటిమీదున్నదే. ఏముంది, ఆమూణ్ణాళ్ల ముచ్చటా తీరాక తెలిసొస్తుంది అందాల రాణిగారికి, ఇహప్పటికి చెయ్యి జారిపోతుంది!"

"నేనవేదీ అదే, సమయం మించిపోతుంది! సాదిక్‌తో కాపురం చెయ్యక

పోడానికి వాడిలో యేం లోపంవుందని? గ్రామంలో 'జిగిత్' అందరిలోకీ వాడే మిన్న కదా."

"మరి అత్తగారి మాటో? అలాంటి అత్తగారిని ఇమ్మంటే దేముడు అందరికీ ఇస్తాడా? ఇవ్వడే! అలాంటి అత్తగారు నూటికీకోటికీ ఒక్కర్తె వుంటుందేమో. తెలివితక్కువ భడవ, తన బతుకు తనే తగలేసుకుంది, వాళ్ళ పుణ్యానికే మళ్ళీనీ!"

జమీల్యాని, నా వెనకటి వదినెగారిని, దుయ్యబట్టనివాణ్ణి బహుశ నే నొక్కడనే అయివుంటాను. ఆ చిరిగిపోయిన ఆర్మీకోటూ, అరిగిపోయిన బూట్లూ దనియార్ తొడగనీ, వాడే మా అందరిలోనూ ఆత్మికంగా సంపన్నుడన్న సంగతి నాకు తెలును. అతడితో జమీల్యా సుఖంగా వుండదని నేనెంత మాత్రమూ నమ్మను. నా జాలి అంతా మా అమ్మ గురించే. జమీల్యా వెళ్ళి పోవడంతో ఆమె శక్తి కూడా వెళ్ళిపోయిందనే నాకనిపించింది. ఆమె బెంగ పడిపోయింది, మనిషి చిక్కి శల్యమైపోయింది. ఇప్పుడు నాకు తెలిసొచ్చి నట్టు, జీవితం పాతపునాదుల్ని ఒక్కొక్కప్పుడు ఇంత నిర్దాక్షిణ్యంగా కూల్చేస్తుం దనే విషయాన్ని ఆమె సుతరామూ ఒప్పుకోలేకపోయింది. బ్రహ్మాండమైన మహావృక్షం తుపానుదెబ్బకి వేళ్ళతోసహా తిరగబడిపోయినట్టయితే, అది ఇహ లేవలేకపోతుంది. అమ్మ యింతకు ముందు యెవ్వరినీ అడిగేదికాదు సూదిలో దారం యెక్కించమని: అలా అడగడం తన అభిమానానికి దెబ్బ అనుకునేది. అటువంటిది, ఓనాడు నేను స్కూలునుంచి యింటికొచ్చేసరికి చూదును — అమ్మ గజగజ వణకిపోతూన్న చేతుల్తో సూదిలోకి దారం యెక్కించ బోతూంది, సూదిలో కన్నం ఆమె కంటికి ఆనక ఆమె యేడుస్తూంది.

"ఒరేయ్, ఈ దారం యెక్కించిపెడుదూ సూదిలోకి" అని నన్నడిగి భారంగా నిట్టూర్చింది. "జమీల్యా అయినా సుఖపడిపోయేదీ, బావుకునేదేమీ

ఉండదు.... నిజంగా అది యిల్లు చక్కబెట్టుతూ యెంత చక్కగానో సంసారం దిద్దుకునుండేది కదా. లేచి వెళ్లిపోయింది.... మనని వదిలి పెట్టేసింది.... ఎందుకెళ్లి పోయింది? దానికి మన దగ్గర యేమిటి తక్కువైందని?..."

అమ్మని కాగలించుకుని ఆమెని వూరుకోబెట్టి, దనియార్ యెటువంటి వ్యక్తో చెప్పాలని నాకు మహా అనిపించింది. కాని అందుకు నాకు ధైర్యం చాలిందికాదు. నేనలా చేసివుంటే ఆమెను జీవితాంతం అవమాన పరచడమే అయేది.

ఇంతకీ ఈ విషయంలో నేను అమాయికంగా తీసుకున్న పాత్ర బయట పడకుండా దాగనేలేదాయె....

మరి కొద్ది రోజులకి సాదిక్ ఇంటికొచ్చేశాడు. వాడు మహా దుఃఖ పడ్డాడు, సహజమే మరి ఐనా వాడు ఓనాడు తాగి ఒస్మాన్‌తో అన్నాడు:

"లేచి వెళ్లిపోయింది, వెళ్లాల్సిన చోటకే వెళ్లిందిలే. ఏముంది, ఎక్కడో పడి ఛస్తుంది. బోలెడుమంది ఆడాళ్లు దొరుకుతారు మనకి. ఎంత బంగారపు జుట్టున్న ఆడదైనా ఏ చచ్చు మగపురుగుపాటీ చెయ్యదనుకో!"

"నిజంరా!" అన్నాడు ఒస్మాన్. "ఆనాడు నాకు వాడు దొరికుంటే – చంపేసి వుందుననుకో – అక్కడికక్కడే! దాని సిగ నా గుర్రం తోకకి ముడేసి వుందును! బహుశా వాళ్లు దక్షిణాదికి వెళ్లుంటారు – పత్తి పొలాల్లోకి, లేకుంటే కజఖ్‌స్తాన్‌కే వెళ్లారో మరి. దేశాలు పట్టి తిరగడం వాడికిది కొత్తకాదుగా. కాని అసలు ఇదంతా ఎలా జరిగిందో మాత్రం నా బుర్రకేమీ యెక్కడంలేదురా, ఇలా జరుగుతుందని అసలు యెవ్వడూ

అనుకోలేదురా, ఒరేయ్! అనుకోడానికే ఎవ్వడికీ వీల్లేకపోయిందిరా. ఆ పన్నాగం అంతా పన్నినది అదే, ఆ ముండే. దాన్ని చంపేస్తాను.''

ఇలాంటి మాటలు విన్నతరవాత నాకు ఒస్మాన్‌తో, ''ఒరేయ్, కోతల ప్పుడు నీ కెలాంటి పాఠం చెప్పిందో నువ్వింకా మరచిపోలేకుండా వున్నావురా. పాపిష్ఠి బుద్ధిరానీది.'' అని అనాలనిపించింది.

ఓనాడు నేను, మరెందుకనో గాని, ఇంట్లో కూచుని స్కూలు గోడవార్త పత్రిక కోసమని యేదో బొమ్మ వేస్తున్నాను. అమ్మ పొయ్యి దగ్గర హడావుడి పడుతూంది. తటాలున సాదిక్ గదిలోకి చొరబడ్డాడు. వాడి ముఖాన రక్తంలేదు, కళ్లు సగంమూసి నా వేపు విషపుచూపు చూస్తూ నామీదకి విరుచుకుపడి, నా మొగం యెదట ఓ కాగితం చూపించి,

''ఈ బొమ్మ వేసింది నువ్వేనా?'' అని అడిగాడు.

నాకు నోరు పెగల్లేదు, అది నేను వేసిన మొట్టమొదటి బొమ్మ. జమీల్యా దనియార్లు జీవకళతో నా వేపు చూస్తూన్నారనే నా కనిపించింది.

''నేనే.''

''వీడెవడు?'' అని వేలితో కాగితం తట్టాడు సాదిక్.

''దనియార్.''

''ఓరి, ద్రోహీ!'' అంటూ సాదిక్ నా మొగంమీద అరిచాడు.

ఆ కాగితాన్ని వాడు ముక్కముక్కలుకింద చింపిపారేసి, హుంకరిస్తూ తలుపు దభీమని మూసేసి గదిలోనుంచి వెళ్లిపోయాడు.

అమ్మ యెంతసేపో అలా మౌనంగా వుండిపోయి, ఇహ ఆ తర్వాత నన్నడిగింది:

''నువ్వు ఎరుగుదువేమిటి?''

''ఊఁ, ఎరుగుదును.''

ఆమె పొయ్యిగూటికి చేరబడిపోయి, నా కేసి యెంత నిందాపూర్వకంగానూ విభ్రాంతితోనూ చూసిందో మరి! ఇహ నేనప్పుడు: "వాళ్ల బొమ్మ మళ్లీ వేస్తాను!" అనేసరికి, ఆమె విచారంతో నీరసంగా తల పంకించింది.

చించిపారేసి అక్కడ పడివున్న ఆ కాగితపు ముక్కల్ని చూసేసరికి భరించ శక్యంకాని బాధ నన్ను ఉక్కిరిబిక్కిరి చేసేసింది. నన్ను ద్రోహి కింద యెంచుతే యెంచనీయండి. నేను యెవరికి ద్రోహంచేశాను? కుటుంబానికా? మా బంధువర్గానికా? సత్యానికి, జీవిత సత్యానికి, ఈయిద్దరి వ్యక్తులను గురించిన సత్యానికి నేను ద్రోహంచేయలేదు! ఈ సంగతి నే నెవ్వరితోనూ చెప్పలేకపోయాను, నా కన్నతల్లే నన్ను అర్థంచేసుకోలేదు.

నా కళ్లముందు సర్వమూ గిరగిర తిరిగిపోయింది, నేలపైన పడున్న కాగితపుముక్కలకి ప్రాణం వచ్చి, అవి నేలపైన సుడితిరుగుతూన్నట్టు అవుపడింది. దనియార్ జమీల్యాలు ఆ చిత్రంలోనుంచి నా కేసి చూసినట్టు నా మనఃఫలకంపై యెంత లోతుగా మలచబడిందంటే, స్మరణీయమైన ఆ ఆగస్టు రాత్రి వాడు పాడిన పాట నేను వింటూన్నట్టే నా కనిపించింది. వాళ్ళు గ్రామంనుంచి యెలా నడిచివెళ్లిపోయారో జ్ఞాపకంతెచ్చుకున్నాను. గ్రామంనుంచి వెళ్లిపోవాలనీ, వాళ్లలాగే నేనూ ఆనందోన్ముఖంగా కష్టభూయిష్ఠమైన మార్గంపై ధైర్యంగా కృతనిశ్చయంతో పయనించాలనే దుర్భరమైన కోరిక నాలో పుట్టింది.

"నేను చదువుకుందుకు వెళ్లిపోతాను.... నాన్నతో చెప్పు. నాకు చిత్రకారుణ్ణి అవాలనుంది!" అని అమ్మతో ఖరాఖండీగా చెప్పాను.

ఆమె నన్ను చివాట్లుపెట్టుతుందనీ, మా అన్నలు యుద్ధంలో చనిపోయారన్న సంగతి జ్ఞాపకం తెచ్చుకుని యేడుస్తుందనీ నేను నిశ్చయంగా అనుకున్నాను. కాని ఆమే యేడవకపోవడం నా కెంతైనా ఆశ్చర్యం కల్గించింది. విచారంగానూ మెల్లగానూ మాత్రం అంది:

"వెళ్ళు, నాయినా, వెళ్ళు.... నా పిట్టలన్నీ ఎగబోదలయాయి, ఇక గూడు వదలిపెట్టి వాటి రెక్కల సత్తువతో అవి యెగిరిపోతాయి.... అవి యెంత యెత్తున యెగరగలవో మనకెలా తెలుస్తుంది? అవును, నువ్వు చెప్పినది నిజమే కావచ్చు. వెళ్లు, నాయనా, వెళ్లు.... ఏమో, నువ్వు అక్కడికెళ్లిన తర్వాత మనసు మార్చుకుంటావేమో ఒకవేళ? ఇది ఒక వృత్తీ, ఒక చేతిపనీ కాదురా, నాయనా – ఈ బొమ్మలు గీయడమూ, రంగులు పులమడమూనూ.... నేర్చుకో నీకే తెలుస్తుంది.... కాని ఇల్లు అంటూ ఒకటి వుందని మాత్రం మరచిపోకు...."

ఆనాడే చిన్న ఇల్లు మా ఇంటినుంచి వేరైపోయింది. మరికొద్ది రోజులకి నేను వెళ్లిపోయాను చదువుకుందుకి.

ఇంతటితో కథ కంచెకెళ్లినట్టే.

చిత్రకళా పాఠశాలలో చదువు ముగించిన తరవాత నన్ను అకాడెమీకి పంపించారు. అకాడెమీ ప్రవేశపరీక్షకు నా డిప్లొమా చిత్రాన్నే సమర్పించాను. ఇది నేను యెన్నో యేళ్లుగా కలలుగన్న చిత్రం.

దనియార్ జమీల్యాలను ప్రదర్శించుతూన్న చిత్రమే ఆ చిత్రమని మీరు ఊహించి తెలుసుకోవడం యేమంత కష్టం కాదనుకుంటాను. శరత్కాలపు స్టెప్‌మైదానపు రోడ్డుమీద వాళ్లిద్దరూ నడుస్తున్నారు. సువిశాలమై ప్రకాశమానమైన దిగ్మండలం వాళ్ల యెదట విస్తరించి వుంది.

నా చిత్రం పరిణతికి ప్రతీక కాకపోవచ్చు – పరిణతి వెంటనే అలవడదు. అయితే యేం, అది నా కత్యంత ప్రియమైన చిత్రం, అది నా సృజనాత్మక మానసికవ్యధ తొలితొలి ఫలితం.

ఇప్పుడు నాకు భంగపాటు కూడా కలుగుతూంటుంది. అప్పుడప్పుడు, ఎటువంటి నిరుత్సాహకరమైన క్షణాలు యెదురవుతాయంటే, నాలో వున్న

ఆత్మవిశ్వాసాన్నే నేను కోల్పోతూంటాను. అలాంటి క్షణాల్లో నాకు అత్యంత ప్రియమైన ఈ చిత్రం మీదకీ, దనియార్ జమీల్యాలమీదకీ పోతుంది నా మనస్సు. వాళ్లవంక యెంతసేపో చూస్తాను, చూసినప్పుడు ప్రతిసారీ వాళ్లతో నేను మాట్లాడుతాను.

"మీరిప్పుడు ఎక్కడున్నారు? ఏ రోడ్డుపైన నడుస్తున్నారు మీరు? మన స్తెప్‌మైదానంపైన ఇప్పుడు ఎన్నెన్నో కొత్త రోడ్లు పడ్డాయి — కజఖ్‌స్తాన్‌నుండి ఏకంగా అల్తాయ్ పర్వతాల వరకూ, సైబీరియా వరకూ కూడానూ! అక్కడ ఎందరెందరో ధైర్యవంతులు పనిచేస్తున్నారు. మీరు కూడా ఆ ప్రాంతాల్లోనే వున్నారేమో? జమీల్యా, ప్రియతమా, నువ్వు వెళ్లిపోయావు, ఒక్కసారైనా వెనక్కి తిరిగిచూడకుండా వెళ్లిపోయావు. బహుశా నువ్వు అలసిపోయే వుంటావు, నీలో విశ్వాసాన్ని నువ్వు కోల్పోయావేమో? దనియార్ నీకు జీవగఱ్ఱ, అతనిమీద ఆనుకో. జీవితం గురించీ, ప్రేమ గురించీ, భూప్రపంచం గురించీ అతడు తన పాటల్ని నీకు వినిపించనీ! ఆ పాటలతో స్తెప్‌మైదానానికి చైతన్యం వచ్చి, తన రంగులన్నిటినీ ప్రదర్శించనీ! ఆ ఆగస్టు రాత్రిని నీ స్మరణకు రప్పించనీ! జమీల్యా, నీ మార్గాన సాగిపో, నువ్వు చేసినదానికి యెన్నటికీ విచారించకు, నీ ఆనందాన్నీ నీ సౌభాగ్యాన్నీ నువ్వు కష్టపడి సంతరించుకున్నావు!"

వాళ్లకేసి చూస్తూండగా, దనియార్ గొంతు నాకు వినబడుతుంది. అతడు నన్ను పిలుస్తున్నాడు, ఆ దారినే రమ్మనమని. ప్రయాణానికి నేను సిద్ధపడాలనీ, అందుకు వేళైందనీ దీని అర్థం. స్తెప్‌మైదానం దాటి మా స్వగ్రామానికి వెళ్లిపోతాను, అక్కడ నాకు కొత్త రంగులు దొరుకుతాయి.

నా ప్రతి కుంచెలోనూ దనియార్ పాట మారుమోగుగాక! నా ప్రతి కుంచెలోనూ జమీల్యా హృదయం స్పందించుగాక!

## పాఠకులకు మనవి

ఈ పుస్తకం గురించీ, దీని అనువాదం గురించీ మీ అభిప్రాయాలను "ప్రగతి" ప్రచురణాలయానికి దయచేసి తెలుపండి.

మీ అభిప్రాయాలను ఈ కింది చిరునామాకు పంపండి:

Progress Publishers
17, Zubovsky Boulevard
Moscow, USSR

మా ప్రచురణలు
దొరికే చోట్లు:

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
చంద్రం బిల్డింగ్స్
విజయవాడ – 520 004

విశాలాంధ్ర బుక్ హౌస్
ఏలూరు రోడ్డు
విజయవాడ – 520 002

విశాలాంధ్ర బుక్ హౌస్
సుల్తాన్ బజారు
హైదరాబాదు – 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్
రైల్వే ఫీడర్స్ రోడ్డు
అనంతపురం – 515 001

విశాలాంధ్ర బుక్ హౌస్
బజారు వీధి
తిరుపతి – 517 501

విశాలాంధ్ర బుక్ హౌస్
సూపర్ బజారు ఎదుట
మెయిన్ రోడ్డు
విశాఖపట్నం – 530 002

విశాలాంధ్ర బుక్ హౌస్
జె.పి.యన్. రోడ్డు
మండీ బజారు
వరంగల్ – 506 002

విశాలాంధ్ర బుక్ హౌస్
మెయిన్ రోడ్డు
అరండల్ పేట
గుంటూరు – 522 002

"జమీల్యా" — ఇది ప్రేమ కథ. శక్తి, సౌందర్యమూ, ప్రేమ, ధైర్యమూ, సాహసమూ గురించిన కథ. కలకాలంనుండీ పాతుకుపోయిన దురభిప్రాయాలను అధిగమించి, అజ్ఞాత నూతన జీవితాన్ని అందుకోడానికి ముందడుగు వేసే ప్రేమ గురించిన కథ.

జమీల్యా చక్కని పడుచు, దనియార్ యువకుడు. వీళ్ల ప్రేమకథను చిత్రకారుడు కాబోయే ఒక కుర్రవాని నోటినుండి వింటాం. ఉత్తేజకరమైన వాళ్ల ప్రేమను చూసి ఆ కుర్రవాడు యిలా అంటాడు: "...నేను విభ్రాంతి చెందిపోయాను... వీళ్ళు అపూర్వానందంలో ఓలలాడుతూన్న కొత్త వ్యక్తులు... వీళ్లని అచ్చంగా ఇలా వున్నట్టే చిత్రిస్తాను — ఆనందంలో మునిగివున్నట్టే!"

